# బ్రతుకనేర్చిన వ్యక్తి

(ఇతర కథలు)



రచన:

తాళ్ళూరు నాగేశ్వరరావు

విజయసారథి పబ్లికేషన్స్

విజయవాడ-2.

# ఇందులో

బ్రతుక నేర్చిన వ్యక్తి

బాలమ్మ

పందిట్లో...

విముక్తి

పగిలిన అద్దం

పొడుగూ-వెడల్పూ

నాన్న మంచివాడు కాదమ్మా !

4

ఇందులోని కథలన్నీ యువ,
ఆంధ్రపభ వారపత్రిక, శారద,
విహారి, సాహితి, అభిసారిక
పత్రికలలో ప్రచురించ బడినవి.
ఆయా పత్రికాధి పతులకు కృతజ్ఞుణి.

—రచయిత.

# బ్రతుకనేర్చిన వ్యక్తి

మూడు వేలకు పైచిలుకు జనాభాగల ఆ మూడు వీధులు కౌగలించుకొనే సెంటర్లో ఒక పెద్ద రావిచెట్టు ఉంది. ఆ వూరికి ఆ ప్రదేశం నడి బొడ్డు. పెక్కు విషయాలకు కూడలి స్థానం. ఒకరోజు చక్కని ఉదయాన ఆ రావిచెట్టు ప్రక్కన పాడుపడ్డ చిన్న పెంకుటింట్లో - దిట్టమైన అట్టహాసంతో, మేఘాల్లేకుండా వర్షం కురిసినట్లు ఓ చిల్లరకొట్టు తెరిచి వుండడం చాలామందికి ఇండియా ప్రభుత్వం చంద్ర మండలానికి విజయ వంతముగా రాకెట్ పంపించినంత ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆ కొట్లో ఓ నల్లటి ఇనుప చువ్వ లాంటి మనిషి చిరునవ్వుల చల్లదనాన్ని ముఖంపై అందంగా అమర్చి, అందర్నీ హృదయ పూర్వకంగా ఆహ్వానించే అను రాగ పూరిత దృష్టితో కూర్చున్నాడు. ఆ వూరికి ఆవ్యక్తి కొత్త ఆ ఊర్లో మనుషులు అతన్ని చూడడం అదే మొదలు.

పాడుబడ్డ పెంకుటి కొంపైనా చిల్లరకొట్టు చూడ చక్కగా ఉంది. ఆ అమ్మే వస్తువుల పొందికా, అమరికా అలంకరణా-బస్తీలో కిరాణాకొట్టు వ్యాపారం చేసిన వాడి నేర్పు, నైపుణ్యతా ధ్వనిస్తున్నాయి. ఆ కొట్టు అద్దాల కొట్టు

వలె పరిశుభ్రంగా ఉంది ఆవేళ ఉదయం రావిచెట్టుక్రింద జేనజనంలో ఒకే ఒక ప్రశ్న తిరుగాడుతూంది. 'ఎవరీతను?' ఇంకా కొంతమంది మరికొన్ని ప్రశ్నలకు సమాధానాలు వెతుక్కోలేక సతమతమైనారు. "ఎక్కణ్నుంచి వచ్చాడు?" 'ఎక్కణ్నుంచో వచ్చి, ఇక్కడ-అందులో ఆపాడుబడ్డ పెంకుటి కొంపలో కిరాణాకొట్టు పెట్టాల్సిన ఖర్మమేమిటి?' 'ఆకొంప సంగతి తెలియదా?' "అందులో శనిదేవత యేళ్ళతరబడిగా నివాసం వుంటూన్న విషయం ఎరుగడా?" 'ఇంతకు ముందు ఆ కొంపలో నలుగురు చిల్లరకొట్లు పెట్టి నామరూపాలు లేకుండా నాశనమైన సంగతి తెల్సికోకుండానే కొట్టు పెటాడా?' "ఎంత ధైర్యం? ఎంత సాహసం! ఎంత తెగువ?"

మెల్లగా జనం ఆ కొట్లో వస్తువులు కొనడం సాగించారు. కొత్తొక వింత, పాతొక రోత, అన్న సామెతను పల్లెటూళ్ళల్లో విలువ జాస్తి. పైగా కొత్తకొట్లో సరుకులు చవుగ్గా యిస్తున్నట్లు కనిపెట్టారు ఆచిల్లరకొట్లో సిగిరెట్లు, బీడీలు, ఒకమోస్తరు ఫాన్సీ సామాన్లూ కూడా వుండడం ఒకవిశేషం. జనాకర్షణకు ప్రత్యేకమైన కారణం; అన్ని తరగతుల ప్రజానీకానికి వస్తుసౌలభ్యం ఏర్పర్చడం – ఆ కొట్టు యజమాని ఆశయంవలె అగబడుతూంది. ఉప్పు దగ్గర్నుంచీ ఆస్ప్రోవరకూ ఉన్నాయి.

వారంరోజులు గడిచేటప్పటికి ఆవూళ్ళో అంతకు ముందు ఇరవైయేళ్ళనుంచి వున్న చిల్లరకొట్టుకు బేరాలు సొంతం పడుకున్నాయి. కొత్త చిల్లరకొట్టు రావిచెట్టు ప్రక్క పాడుబడ్డ పెంకుటి ఇంట్లో పెట్టి నడుపుతూన్న సాహస

వంతుడైన యజమాని శంకరయ్య ఆ వూళ్ళో వివిధ మనః ప్రవృత్తులుగల ప్రజలకూ, సాధ్యమైనంత దగ్గర వాడైనాడు. ప్రజాసేవకోరకే తనవ్యాపారం అన్నట్టు వస్తువులు కారుచవుకగా యివ్వడమూ, ఊరి కచేరీ చావడికి వెళ్ళి తహశీల్ కట్టి పనిలేని బాపతుకుకూడ అరువుపుస్తకములో చోటు కల్పించడమూ, ఓర్పుగా నేర్పుగా బేరాన్ని రాబట్టుకోవటమూ—త్వరలోనే శంకరయ్య చిల్లరకొట్టు ఆవూళ్ళో చేవను నిలవదొక్కుకో గలిగింది. 'శంకరయ్యగారు? ఈ ఊళ్ళో ఇంతకుముందు నలుగురైదుగురు ఇక్కడే కిరాణాకొట్టు పెట్టారుగానీ, ఒక్కడూ బాగుపడలేదు. పెట్టినఅప్పులు ఒక్కడూ వసూలు చేయలేదు, పైగా యీ కొంపలో శని ఉన్నదని వాడుక. నీ సాహసం మెచ్చుకో దగ్గది!"అని ఎవరైనా అంటే"వ్యాపారమంటేనే సాహసం ధైర్యే సాహసేలక్ష్మి,అన్నారు పెద్దలు. భయస్తులకు వ్యాపారంలో నిలకడా, లాభాలూ ఉండవు. నేను సాహసం చేసినా—వూరు మంచిది కావటాన నష్టపడే అవకాశం లేదు" అంటాడు శంకరయ్య తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో.

శంకరయ్య సంసారం బహుచిన్నది. అతనూ,భార్య, నాలుగేళ్ళ కుర్రవాడూనూ. 'మీది ఏవూరు?' అని అడిగిన ఒక ప్రశ్నకు సమాధానం చెబుతూ "మాది చాలదూరం. నెల్లూరు సైడు. బ్రతుకుదెరువుకోసం ఊరు విడిచిన వాళ్ళకు ఒకవూరు అని ఏముంది? ఇక్కడ వాతావరణం అనుకూలిస్తే ఇక్కడే స్థిరపడి పోవాలని అనుకుంటున్నాను"అన్నాడు శంకరయ్య.

మూడు నెలలు గడిచాయి.

ఈ మూడు నెలల్లో శంకరయ్య ఆ ఊళ్ళో పుట్టిపెరిగిన వ్యక్తిలాగా పాతుకు పోయినాడు. పిల్లలు మొదలు పండు ముసలివాళ్ళ వరకూ శంకరయ్య చిల్లరకొట్టు, అంటే తెలియనివాళ్ళు లేరు. షావుకారు చెంచు బసవయ్యకూడా ఆ కొట్లోనే ఖాతా ప్రారంభించాడు. పైగా మరొక విషయం ద్వారా శంకరయ్య పేరు నలుగురినోళ్ళలోనూ పడ్డది. తను వ్యాపారం దృష్ట్యా జీవికను పోషించుకొనే వాడైనా—ముఖ్యంగా మొహం, పరువు ప్రతిష్టలు, ఆస్తిపాస్తులు, మంచి చెడ్డలు విచారించకుండా అడగని వాళ్ళ దేపాపంగా బాదాపు వెయ్యిరూపాయలవరకూ చాలామందికి చేబదుళ్ళు ఇచ్చాడు. వాటిని తను ఎట్లావసూలు చేయగలుగుతాడు_అన్న విచారం రవ్వంతైనా లేకపోవడం_ధర్మవడ్డీ మీద పొలాలు సంపాదించే వాళ్ళకి చచ్చీచావని ఆశ్చర్యంగా ఉంది. శంకరయ్యకు డబ్బు మీద ఎంత నిర్లక్ష్యం?_అనుకున్నారు కొంతమంది. అతని భరవాసాలో ఏదో నిగూఢ రహస్యముంది! – అనుకున్నారు మరికొంతమంది. వొట్టి అమాయకుడు, పిచ్చివాడు_ అనుకున్నారు ఇంకొంతమంది. ఏమైనా శంకరయ్య తన ఆర్థిక స్తోమతను గురించి ఊళ్లో పెద్దమనుష్యుల హృదయాల్లో సదభిప్రాయాన్ని గాఢంగా కలిగించడంలో సంపూర్ణంగా కృత కృత్యుడైనాడని చెప్పొచ్చు.

ఒకనాటి సాయంత్రాన శంకరయ్య మనస్సులో ఓ కొత్త ఆలోచన కన్ను తెరిచింది. ఊళ్ళో ఏ రవికె గుడ్డ కావాల్సి వచ్చినా ఏ నేతచీర కావాల్సి వచ్చినా_బస్తీకి

పడుగెత్తాల్సి వస్తోంది అల్లాంటి అగత్యాన్ని తగ్గించి ప్రజల సౌకర్యాన్ని సుగమం చేసే తలంపుతో-అతను ఓ బట్టల దుకాణాన్ని ప్రారంభించుదా మనుకొన్నాడు. నలుగురైదు గురు పెద్ద మనుష్యులకు మనస్సులోని ఊహా, అందువల్ల ఊళ్ళోని ప్రజలకు కలిగే ఉపయోగాన్ని-సవిస్తరంగా చెప్పాడు. వాళ్ళు గంగిరెద్దులవలె తలలు ఆడించారు. కాని శంకరయ్య అతివినయంగా ఒక ముఖ్యమైన యిబ్బందిని వాళ్ళకు విన్నవించుకున్నాడు. "బట్టల దుకాణం ప్రారంభించేందుకు కనీసం అయిదారు వేల రూపాయలు కావాలి, నాదగ్గర అంతమొత్తం పైకం ప్రస్తుతానికి లేదు. అప్పుల మీద, చేబదుళ్ళమీద ఉన్నాయి. క్రమేపీ వసూలు చేస్తా ననుకోండి; ఇప్పుడు కనీసం మూడునాలుగు వేలైనా రూపాయిలు వడ్డీమీద అప్పుగా యిచ్చే ఉదారస్వభావు లెవరైనా ఉంటే ఊళ్లో కొత్తగా బట్టల దుకాణాన్నికూడా ప్రారంభించవచ్చు."

ధర్మవడ్డీ దాత దానయ్యగారి అంజయ్య నవ్వుతూ "ఇందులో ఉదార స్వభావం ఏముందయ్యా? వడ్డీవ్యాపారం కూడా ఒక రకమైన వ్యాపారమేగా. నేను రెండువేలు యిస్తాను. మిగతాది ఎక్కడైనా చూసుకో" అన్నాడు.

శంకరయ్య చిరునవ్వుద్వారా సంపూర్ణమైన ఆత్మ సంతృప్తిని వెలువరించాడు.

షావుకారు చెంచు బసవ పూర్ణయ్య అడగటంతో తే-పదిహేనువందలు రూపాయలు వడ్డీమీద అప్పుగా యిచ్చాడు. ఊరుమున్సబు అయిదు వందలిచ్చాడు నోటు

వ్రాయించుకొని. ఆవూరి పురోహితుణ్ని కనుక్కున్నాడు-బట్టలదుకాణం పెట్టటానికి ఎప్పుడు మంచిదోనని. అమావాస్య ఘడియలు వెళ్ళనివ్వమన్నా డాయన. ఈలోపుగా శంకరయ్య మంచిమాటలతో "అయ్యా! బాబూ!" అనే బ్రతిమాలింపుతో, లాలనతో-రావాల్సిన చేబదుళ్ళను చాలామట్టుకు వసూలు చేసుకున్నాడు. వూళ్లో అందరికీ తెలిసిపోయింది-శంకరయ్య బట్టల దుకాణాన్ని ప్రారంభించబోతున్నాడని.

ఒకరోజు కనుచీకటి పడ్డాక శంకరయ్య పనిగట్టుకొని షావుకారు చెంచు బసవపూర్ణయ్యఇంటికొచ్చాడు. ఆమధ్య వాళ్ళిద్దరికీ స్నేహం గాఢతరం కాజొచ్చింది.శంకరయ్యనుంచి ఆయన కొన్ని విషయాల్లో సలహాలు పొందడమూ, షావుకారు గారినుంచి శంకరయ్య కొన్ని విషయాల్లో సలహాలు పొందడమూ జరుగుతూన్నది. ఆరోజు శంకరయ్య ఒక ముఖ్యమైన రహస్య విషయాన్ని చర్చించేందుకు లాభసాటియైన ఒక గొప్ప సాహసాన్ని నెరవేర్చడానికి తగిన వాతావరణాన్ని ఉత్సాహాన్నీ నైపుణ్యాన్ని సమకూర్చుకోవడానికే వచ్చాడు. షావుకారు శంకరయ్య మేడమీద గదిలో మెల్లగా ఓ గంట సేపు మాట్లాడుకొని, గట్టిపాటి నిశ్చయానికే వొచ్చారు.

ఆ మరునాటి రాత్రియే ఇద్దరూ తెనాలి స్టేషనుకు వెళ్లారు-మెయిల్లో మద్రాసు వెళ్ళేందుకు. ఇద్దరూ సెకండు క్లాసు టిక్కెట్టు తీసుకొని మెయిలు ఎక్కారు. మెయిల్ ఒంగోలు దాటేవరకూ ఇద్దరూ పిచ్చాపాటి మాట్లాడు

కొంటూనే ఉన్నారు తర్వాత షావుకారు; గారి కనురెప్పల పైన నిద్రాదేవి తిష్ఠవేసికొని కూర్చోవడంవల్ల-'శంకరయ్యా నేను ఓ గంటసేపు నిద్రపోతానుగాని, నువ్వు మేల్కొని ఉండు" అన్నాడు లెదర్ బ్యాగ్‌ను తలకింద పెట్టుకొని పడుకుంటూ.

"అల్లాగే" అన్నాడు శంకరయ్య బావుటా బీడీ వెలిగిస్తూ.

షావుకారు చెంచు బసవపూర్ణయ్య నిశ్చింతగా, సుఖంగా, గాఢంగా-చేయబోతూన్న సాహసకృత్యం తాలూకు అందమైన కలలు కంటూ నిద్రబోయాడు. ఆయనకు నిద్ర మెలుకువ వచ్చేటప్పటికి మెయిల్ నెల్లూరు స్టేషన్లో ఆగివుంది. తలక్రింద పెట్టుకున్న లెదరుబ్యాగ్ చూచుకున్నాడు. లేదు.

గుండెల్లో ఒక్కసారి బండరాయి బ్రద్దలయినట్లయింది. వొళ్ళంతా చెమటపోసి, మాటరాక-గజగజ వొణికి పోయాడు. శంకరయ్య లేడు. కేక వేశాడు—లెట్రిన్‌లో ఉన్నాడేమోనని. జవాబు లేదు.

నెల్లూరు స్టేషన్లో దిగాడు షావుకారు చెంచు బసవపూర్ణయ్య దిగులుగా. ఎంతపని చేశాడు శంకరయ్యగాడు? అయిదువేల రూపాయల లెదరుబ్యాగుతో పరారైనాడు. నమ్మకద్రోహి. దొంగటక్కరి. మోసగాడు. లుచ్ఛాఖోరు! ఎక్కడ కెళుతాడు! వూళ్లో భార్యా, పిల్లవాడూ ఏమౌతారు! తను వెంటనే వెళ్ళి వాళ్ళను నిర్బంధించాలి. ఇంతకీ

తను వీడిమోసంలో ఇరుక్కోవడమేమిటి? ఒక వందరూపాయల నోటుకు నాలుగు దొంగవందరూపాయలనోట్లు మద్రాసులో యిస్తున్నారనీ తనచేత అయిదువేల రొక్కం తెప్పించి మధ్యలో ఇట్లా మోసపుచ్చి, ఆపైకం పట్టుకెళ్లుతాడా? ఎంత ధైర్యం, ఎంత సాహసం? ఎన్ని గుండెలు? వీడ్ని పోలీసులకు అప్పగించి-వీడి సంసారాన్ని వీధిపాలు చేయకుంటే తనపేరు చెంచు బసవపూర్ణయ్య కాదు. అనుకుంటూ షావుకారుగారు తిరుగు ప్రయాణమై ప్యాసింజరు రైలులో స్వగ్రామం వొచ్చాడు

ఊళ్లోకి వచ్చి రావవడంతోనే రావిచెట్టుప్రక్క పాడుపడ్డ పెంకుటింట్లోని శంకరయ్య కొట్టుకేసి వెళ్ళాడు. ఆశ్చర్యం! ఆ కొట్టు మూసివేయబడిఉంది ఏమైనారు పెళ్ళామూ, పిల్లవాడూనూ! షావుకారుగారి నిప్పువలె నుండే గుండెపైన చల్లనిసీరుగుమ్మరించినట్లయింది. అక్కడవాళ్లను కనుక్కోగా నిన్నసాయంత్రమే ఏదోవూరు పెళ్ళికని చెప్పి వెళ్ళారని తెలిసింది.

రెండు వారాలు గడిచాయి.

శంకరయ్యగానీ, అతనిభార్య, పిల్లవాడుగాని-మళ్ళీ ఆ వూళ్ళో అడుగుపెట్టలేదు. రెండుమాసాల అద్దెను వసూలుచేయడంలో సాచేతపడ్డ ఇంటియజమాని కోపగించుకొని, గడ్డపలుగుతో శంకరయ్య చిల్లర కొట్టు తాళాన్ని పగులగొట్టాడు- లోపల ఏమీలేవు. ఇంటియజమాని నిరాశతో నిట్టూర్చాడు.-చిల్లర కొట్టులోని చచ్చు ఉల్లిపాయలనూ, మురికి చింతపండునూ, పుచ్చిపోయిన ఎండు మిరపకాయ

లనూ, చీమలుతిన్న బెల్లపు ముక్కలనూ, రెండు చార్ మినార్ సిగిరెట్టు పెట్టెలనూ, బావుటా బీడీల దిండునూ చూసి.

ఒక్కసారి ఊరంతా గుప్పుమన్నది–శంకరయ్య ఊరి నుంచి పరారైనాడని. అతనికి రూపాయి వడ్డీకి అప్పులిచ్చి నోట్లు వ్రాయించుకున్న పెద్దమనుష్యులంతా ఆ నోట్లు నాలిక గీచికొనేందుకుకూడా పనికి రావని తెల్సికొని "లబో దిబో" మన్నారు. షావుకారు చెంచు బసవపూర్ణయ్య కుడితితొట్లో పడ్డ ఎలుకకుమల్లె గిలగిల తన్నుకొన్నాడు.

మూడు వీధులు కవుగలించుకొనే సెంటర్లోని రావి చెట్టుప్రక్క పాడుపడ్డ పెంకుటింటికి మళ్ళీ తాళం పడింది.

"ఈ ఇంటిని పట్టుకున్న శని ఇంకా వదల్లేదు. ఈ ఇంట్లో కొట్టు పెట్టుకున్న వాడెవడూ మూడేళ్ళపాటు సక్రమంగా ఉండలేదుగదా!" అన్నాడొకాయన వ్యాఖ్యానిస్తూ.

"ఆ ఇంటికికాదు శనిపట్టుకున్నది, మనుష్యుల్కి. శంకరయ్య మూడు. పుట్టగొడుగుకు మల్లే వెలిసి—పది వేలు సంపాదించుకొని ఆరునెల్లతర్వాత అదే పరారు. అతనికి అప్పులిచ్చిన వాళ్ళకు శని పట్టుకున్నదా–ఆ ఇంటికా?" అన్నాడు మరొకాయన ప్రతిగా వ్యాఖ్యానం చేస్తూ.

"నిజమే" అన్నాడు ఇంకొకాయన మూర్తీభవించిన విషాద మూర్తిలా మౌనంగాఉన్న ! ఆ పాడుబడ్డ పెంకుటింటిని చూస్తూ..

2)

# బాలమ్మ

"ఏయ్! బాలమ్మా! ఎక్కడున్నావు? ఉత్తరం వొచ్చింది!"

అప్పుడే బస్తీనుంచి వొచ్చి, పెరుగు తట్ట యింట్లో అటకమీద పెట్టి, పొయ్యిరాజేసి, అరసోలెడు బియ్యం కడిగిపెడదామని—పెరట్లో వరల బావిలో మట్టికడవ వేసి, తాటి బద్దెమీద ఎడమకాలు ఆనించి, వూపుగా నీళ్ళు తోడుతూన్న బాలమ్మకు పోస్టు తాతయ్య కేకలు వినిపించాయి.

మట్టి బుంగలోని నీళ్ళను రాతిగాబు చెంత బెట్ట చిరునవ్వు నవ్వుకుంది బాలమ్మ. పైటచెంగు గాలిలో విదిలించి ముఖానికి పట్టిన చిరుచెమటను తుడుచుకుంటూ 'ఉత్తరం వొచ్చిందన్న మాట' అనుకుంది.

ఎండ పొడలు పొడలుగా వేస్తోంది.

గాలి పాటుకు నిట్టాడి తాటాకులూ, ఇంటిచుట్టూ దశిగా యెదిగిన చిట్టికేసర చెట్లూ—చప్పుడు చేస్తున్నాయి.

దూరంగా స్టేషన్లో పదకొండు గంటల ప్యాసింజర్ ఆగి, బయలుదేరుతూ కూత వేసింది.

బాలమ్మ అయిదేళ్ళ కూతురు లక్ష్మి ఆ ఉత్తరాన్ని తీసికొచ్చి తల్లికిచ్చింది.

ఆ ఉత్తరాన్ని అందుకొని బాలమ్మ అటూ ఇటూ చూసింది. ఏం లాభం? ఇరవై మూడేళ్ళు వొచ్చినా ఆమెకు అక్షరాభ్యాసం కాలేదు.

బస్తీనుంచి అమ్మ తెచ్చిన రబ్బరు బొమ్మ పట్టుకొని లక్ష్మి ఆటలకు వెళ్ళింది.

బాలమ్మ వేగిరం రాతి గాబుదగ్గర దబరా గిన్నెలో బియ్యం కడిగి, పొయ్యిమీద పెట్టి - కరణం కోదండ రామయ్య గారింటికి వెళ్ళింది.

మండువా యింటి వసారాలో ఇనుప పడక కుర్చీలో కూర్చుని ఇరవైయేళ్ళనాటి దస్తావేజుల్ని తిరగవేస్తున్నాడు కోదండరామయ్య. ఆయన యెదురుగ్గా స్తంభం ప్రక్కన నిలబడి—"బాబుగారూ" అన్నది బాలమ్మ.

ముక్కుమీదకు జారిన గోల్డుగోల్డు ఫ్రేం కళ్ళద్దాలను పైకినెట్టి, ఆమెకేసి కనుబొమలు కదిలించి చూస్తూ— "ఏమిటే! ఏమిటే కథా!" అన్నాడు కోదండరామయ్య

"కాస్త యీ ఉత్తరం ముక్క చదివిపెట్టండి బాబుగారూ!"

ఒక్క చిటికె ముక్కుపొడుం ఘాటుగా పీల్చి, గొంతు సవరణకు వొచ్చేట్టు సకిలించి, ఆ ఉత్తరం అందుకున్నాడు.

"ఎక్కణ్నుంచి బాబుగారూ!" ఆదుర్దా నంతటినీ కళ్లలో కూడ బెట్టి వెళ్ళగ్రక్కింది బాలమ్మ.

ఆ ఉత్తరాన్ని మనస్సులో ఓ మాటు చదువుకున్న కరణంగారు, తాపీగా కళ్ళజోడు తొలగించి—తేట తెల్లంగా చిరునవ్వు నవ్వాడు.

"నీ ఆయన ఆచూకీ దొరికిందే బాలమ్మా! అతగాడు వ్రాయించిందే ఈ లేఖ. చదువుతాను విను" కరణంగారు మళ్ళీ కళ్ళజోడు తగిలించుకున్నాడు.

"......బాలమ్మకు భర్త బాలయ్య వ్రాయించునది క్షేమం. అమ్మాయి లక్ష్మి కులాసాగానే ఉంటున్నదని భావించెదను. నేను ఇక్కడ హైదరాబాద్‌లో బాగానే వున్నాను. ఇల్లు వొదిలిపెట్టి, మతి సరిగ్గాలేక, యింత కాలమూ ఆ ఊరూ, ఆ వూరూ తిరిగి - చివరకు యిక్కడ గాజుగాయి ఫ్యాక్టరీలో కూలీగా చేరాను. పొట్ట గడుస్తున్నాది. రెండుమూడు నెలలుపోతే పని ఖాయమవుతాది." చదవడం ముగించి కళ్ళజోడు తీశాడు కరణంగారు.

బాలమ్మ కంట తడిబెట్టింది. సన్నగా ముక్కు చీది వేసింది. పైట చెంగుతో ముఖం అద్దుకొంది. ఆమె దుఃఖాన్ని కరణంగారు పసిగట్టాడు. సానుభూతిని సులభంగా ప్రకటించాడు

"ఎందుకే యింకా కంట తడి బెడతావ్! బాలయ్య ఉనికి తెల్సినందుకు సంతోషించక. ఆరు నెల్లయిందా వాడు కొంపవిడిచిపెట్టి! ఇంతకాలమూ 'ఏమైనాడో! ఎక్కడికెళ్ళాడో! ఎందుకెళ్ళాడో! ఎప్పుడొస్తాడో! అసలు బ్రతికే వున్నాడో! లేదో!' ఇల్లాంటి ప్రశ్నలతో నువ్వూ ఊళ్ళో వాళ్ళూ విసిగి వేసారి పోయారా! మొగుడికి మందు పెట్టావనీ, నీ పోరుపడలేక ఏ రైలు క్రిందనో తల పెట్టాడనీ' దేశాలవెంటబడి బైరాగుల్లో కల్సినాడనీ-ఇన్ని పుకార్లు ఊళ్ళో అనుల్లో ఉన్నాయా? మీ ఆయన్ను గురించి వున్న

వరంతులకు ఈ నాటితో స్వస్తి. బ్రతికే వున్నాడు, సలక్షణంగా ఫ్యాక్టరీలో పని చేస్తున్నాడు. పని ఖాయమైనాక పైకం కూడా పంపుతాడు. కావాలంటే నిన్నూ, పిల్లను కూడా దీసికెళతాడు. ఇది దుఃఖించాల్సిన విషయంకాదు. సంపూర్ణంగా సంతోషపడాల్సిన సమయం. బాలమ్మ

కావాల్సినప్పుడు కారే కన్నీళ్ళను కోయంబత్తూరు చీరె పైట చెంగులో యింకిపజేసికొని, కరణంగారి దగ్గర్నుంచి ఉత్తరం తీసికొని—ఇంటికి బయలుదేరింది బాలమ్మ తేలికబడ్డ హృదయంతో. ఆమె ఇంటికి చేరేలోపల వీధిలో కూరగాయల రత్తమ్మా, పాల వెంకమ్మా, కట్టెల దుకాణపు చెంచయ్యా, వడ్ల బేరగాడు బసవయ్యా, పంచాయితీ బోర్డు మెంబరు రామకోటయ్యా, ఎలిమెంటరీ స్కూలు టీచరు భుజంగరావూ యెదురైనారు. వాళ్ళతో తన భర్త జాడ తెల్సిన విషయం ఉత్తరాన్ని సాక్ష్యంగా పెట్టి, ప్రస్తావించింది. ఆ పైన కొంతమంది యెదుట 'నన్నొదిలేసి వెళ్లాడు' అంటూ కన్నీళ్ళను కూడా ఖర్చు చేసింది బాలమ్మ. వాళ్ళు మూల్యంలేని అమూల్యమైన సానుభూతిని ఉదారంగా అందజేశారు. ఆమెకు కావాల్సింది కూడా అదే!

* * *

పరీక్ష తప్పుతానని భయపడ్డ విద్యార్థికి ఫస్టుక్లాసు వస్తే, నిత్య దారిద్ర్యంతో నిరాశతో నలిగిపోయే నిరుపేదకు లాటరీలో లక్షరూపాయలు వస్తే, అందవికారంతో అడుగడుగునా కుంగిపోయే అందవిహీనునకు అందాల కానాచి

యగు భార్య లభిస్తే—వారి వారి ఆనందాలకు అంచనా వేయలేము. అట్లాగే భర్త ఆచూకీని మోసుకొచ్చిన ఆ ఉత్తరం వచ్చిన రోజు కూడా బాలమ్మ ఆనందాన్ని అంచనా వేయటానికి వీలులేదు. పొగకు గాలి తోడైనా వూరంతా పాకటానికి కొంత టైము పడుతుందిగాని, 'బాలమ్మ భర్త హైదరాబాద్‌లో ఉన్నాడట' అన్న సంగతి ప్రాకటానికి కొంతటైము కూడా పట్టలేదు. ఆ విషయం క్షణాలమీద ప్రచారం కావటానికి బాలమ్మ అంత నైపుణ్యాన్ని ప్రదర్శించింది.

ఆ రాత్రి వూరు నూటుమణిగాక, కాటా మేస్త్రీ వెంకటస్వామి బుర్రమీసాలు దువ్వుకుంటూ యింట్లోకి వచ్చాడు. తడికె ప్రక్కన నులక మంచంమీద పడుకున్న బాలమ్మ చివుక్కున లేచి, ముక్కాలి పీటమీదున్న లాంతరు వత్తి పెద్దది చేసింది. ఇల్లంతా కాంతితో నిండింది.

నవారు మంచంమీద కూర్చుంటూ "ఏంమే బాలీ! నీ మొగుడు హైద్రాబాద్‌లో ఫ్యాక్టరీలో పని చేస్తున్నాడంట. నిజమేనా!" అన్నాడు వెంకటస్వామి.

"అవును మామా! ఉత్తర మొచ్చింది" తెలుపు గడియ పెడుతూ అన్నది బాలమ్మ.

"బతికే ఉన్నాడన్నమాట"

"పెళ్ళాం మీద అలిగి, ఇల్లూ, ఊరూ విడిచిపెట్టిన వాళ్ళంతా చస్తారనా!"

"చచ్చేవాళ్ళు కూడా వుంటారు. పెళ్ళాం రంకు తనాన్ని ఓర్చుకోలేక—ఆత్మహత్యలు చేసికొనే అభాగ్య

లెంతమంది లేరు దేశంలో. బాలయ్య అంత గుండె మెతక వాడు కాదు" చుట్ట వెలిగిస్తూ అన్నాడు వెంకటస్వామి.

బాలమ్మ ముఖం రోషంతో యెర్రబడింది.

"బల్లకట్టు దిగాక మాట్లాడినట్టు మాట్లాడకు మామా! నువ్వూ వూళ్ళో వాళ్ళను మల్లే నీచంగా మాట్లాడితే నా బ్రతుకు తీరు ఏం కాను? నిన్ను నమ్ముకొనేగదా - మొగుడ్ని విడిచిపెట్టినా, ఎన్ని అపనిందలు పైబడ్డా తలెత్తుకొని తిరుగుతున్నది."

"మాటవరస కన్నా లేవే బాలీ! నీమనసు నాకు తెలీదూ!" చప్పుడు లేకుండా నవ్వుతూ అన్నాడు వెంకటస్వామి.

బాలమ్మ నవారు మంచం మీదకు చేరింది వెంకటస్వామి సరసన. వెంకటస్వామి నోట్లోని చుట్టను బయటకు కిటికీలోంచి విసిరివేసి, బాలమ్మను మోటుగా కౌగిలిలోకి తీసికున్నాడు.

మరికొంత సేపటికి లాంతరు వత్తి తగ్గించబడింది.

బాలమ్మ మొగుడు బాలయ్య భార్యను వొదిలి వూళ్ళు పట్టుకొని తిరగడానికి ముఖ్యకారణం—ఆమె గాడి తప్పిన అవినీతి బ్రతుకేనని వూళ్ళో అందరూ గ్రహించారు. పెళ్ళికాకముందే బాలమ్మ ప్రణయ కలాపాలు పదిమంది కళ్ళల్లో మెదిలినయ్. బాలయ్య కూడా ఆమె సంగతి తెలిసే పెళ్ళికి ఒప్పుకున్నాడని అనుకోవటం కద్దుగానీ— అల్లాంటప్పుడు భార్య అవినీతిని చెవులారా విన్నప్పుడూ, కళ్ళారా చూసినప్పుడూ ఓర్చుకోవాల్సిన అతను, ఎవ్వరికీ

చెప్పకుండా యిల్లు వొదిలిపెట్టి వెళ్ళడు. భార్య నీతిమాలిన ప్రవర్తనను తెల్సికొన్న భర్త—చీమూ, నెత్తురూ వొందర పెట్టగా, భార్యను చావ చితక గొడతాడు; అదుపు ఆజ్ఞల్లో పెట్టేందుకు తీవ్రంగా ప్రయత్నిస్తాడు; లేదా యింట్లోంచి వెళ్ళగొడతాడు. బాలయ్య అట్లా చేయలేదు. మొదట్నుంచీ చూసీ చూడనట్టు వూరుకున్నాడు. మనస్సులో కోపమూ, జుగుప్సా, న్యూనతా పెచ్చుపెరిగినా అణుచుకుంటూ వొచ్చాడు. ఒక్కోసారి హత్యా చేద్దామన్నంత ఉద్రేకం ఉవ్వెత్తుగా లేచినా, స్వభావంలో మార్పు రాకపోతుందా అని సందేహించాడు; నిదానపడ్డాడు. చివరకు ఆమె యథేచ్ఛగా బురదలో పొర్లాడుతూంటే ప్రేక్షకునిగా మిగిలిపోయాడు. కన్నీళ్ళు కార్చాడు. గుండె బరువు దుఃఖంతో బాధపడ్డాడు చేయి చేసుకున్నా ప్రయోజనం లేదని గ్రహించాడు. ఆత్మహత్య చేసికొనేందుకు ఆలోచించాడు. ఆమె అవినీతి దుర్గంధానికి వూళ్లోవాళ్ళంతా ముక్కులు మూసుకుంటూ వుంటే—ఆ కొంపలో అతనెట్లా వుండగలడు? అతనికి చీమూ, నెత్తురూ ఉన్నాయి. కాని వాటిల్లో వేడి అతనికి హృదయమూ, మనస్సూ, ఆత్మా వున్నాయి. కాని అవి కొంపను వొదలి పారిపోవడమే వుత్తమమార్గంగా సూచించాయి.

'బాలయ్య వట్టి ఎంబెన్న. అసమర్థుడు. పెళ్ళాన్ని అదుపులో పెట్టుకోలేక పారిపోయాడు' అన్నారు కొంత మంది. 'దుర్మార్గాన్ని యెదుర్కోలేని మంచివాడు. తనే దూరంగా తప్పుకున్నాడు. అన్నారు మరికొంతమంది.

'బాలయ్య బహుమేధకుడు. భార్య బరితెగిన ప్రవర్తనకు తనను తానే బలిచేసుకున్న అప్రయోజకుడు' అన్నారు ఇంకొంతమంది.

*   *   *

నెలా పదిహేను రోజుల తర్వాత మళ్ళీ బాలమ్మకు హైద్రాబాద్‌నుంచి ఓ లేఖ వచ్చింది, ఆ లేఖను పట్టుకొని బాలమ్మ కరణంగారింటిముందు వాలింది.

జమాబంది హడావుడిలో వున్న కరణంగారు విసుగును కనబర్చకుండా ఆ లేఖను బాలమ్మకు చదివి విన్పించాడు.

"....బాలమ్మకు భర్త బాలయ్య వ్రాయించునది. క్షేమంగా వున్నాను. అమ్మాయి లక్ష్మి కులాసాయని భావిస్తాను. వచ్చే శ్రావణ పూర్ణిమకు యింటికి రావాలనుకుంటున్నాను. వారం రోజులు సెలవుపెట్టి వస్తాను. అమ్మాయిని చూడాలనే కుతూహలం జాస్తిగా ఉంది."

ఉత్తరం చదవడం ముగించి ముక్కుపొడుం ఓచిటికె పట్టించాడు కరణంగారు. ఆయన చెంతనే నిలబడ్డ భార్య లక్ష్మిదేవమ్మ—"అయితే బాలమ్మా! మీఆయన కూతుర్ని చూడటానికేగానీ, నిన్ను చూడటానికి కాదా వస్తూంట" అన్నది చమత్కారంగా.

"ఓరినైతేనేం అమ్మగారూ! ఇంతకాలానికి ఇంటి

కొస్తున్నాడు. అదే పదివేలు!" అన్నది బాలమ్మ అల్ప సంతోషాన్ని అత్యధికంగా ముఖంలో ప్రకటిస్తూ.

"ఓసి నీ తెలివి బంగారంగానూ! ఇంటికొస్తే మీ ఆయన నిన్ను చూడడులే!" అన్నాడు కరణంగారు దీర్ఘం తీస్తూ.

లక్ష్మిదేవమ్మ నవ్వింది నిండుగా.

బాలమ్మ సహం సిగ్గుచేత సరిగ్గా నవ్వలేకపోయింది.

శ్రావణ పూర్ణిమకు బాలయ్య వొస్తున్నాడన్న సంగతి నిముషాలమీద వూళ్ళో ప్రాకిపోయింది. బాలమ్మే సగర్వంగా, సంతోషాతిశయంగా, శుభవార్తగా చెప్పు కుంది. "బాలమ్మా! నీ బ్రతుకు మంచి పంటపండిందనుకో! నగరంనుంచి వొస్తూ మీఆయన చక్కనిచీరెలు తెస్తాడులే. పిల్లదానికి నగలుకూడా పట్టుకొస్తాడులే" అన్నది కూరగాయల రత్తెమ్మ "మంచిరోజులొచ్చాయిలేవే బాలమ్మా" అన్నాడు పంచాయితీ బోర్డు మెంబరు రామకోటయ్య. "మీఆయన డబ్బుగూడా తీసికొస్తాడులే. నీ బ్రతుకు బంగారపు భూమే!" అన్నది పాల వెంకమ్మ "బాలిగాడు మళ్ళీ మొందును తగలబడుదూన్నట్టు–" అనుకున్నాడు కాటా మేస్త్రీ వెంకటస్వామి.

శ్రావణపూర్ణిమ దగ్గరబడింది. వూళ్ళోవాళ్ళు బాలయ్యను చూడాలనే ఉత్సాహాన్ని కనబరుస్తూ బాలమ్మను తరుచూ హెచ్చరించసాగారు. 'ఇంతకాలానికి తన మొగుడు మళ్ళ యింటికి వస్తున్నాడు' అన్న సంతోషాన్ని బహిరంగ పరచ్చటంతో బాలమ్మ తగు శ్రద్ధ తీసికొంటూన్నది. వెంకట

స్వామి ఆమె యింటికి పగళ్ళుగాని, రాత్రుళ్లుగాని రావడం పూర్తిగా తగ్గించాడు.

శ్రావణపూర్ణిమ వొచ్చింది. అందరికంటె ఆ పండుగ తనకి యెక్కువ ముఖ్యం అన్నట్టు—బాలమ్మ యింటిని ముగ్గులతోనూ, అలంకరణలతోనూ శోభాయమానం చేసి, రకరకాలైన పిండివంటలు వండి, పట్టుచీరా, రవికా, కాసుల పేరూ, వడ్డాణమూ, వొంకెల గాజులూ, మెట్టెలూ, పట్టాలూ ధరించి ఆనందోత్సాహాలతో భర్తకోసం యెదురు చూడసాగింది. ఇరుగూ పొరుగూ వాళ్ళు కూడా బాలమ్మ వీధి వాకిటకేసి ఓ కన్ను నిలిపారు బాలయ్య యెప్పుడు వస్తాడో, యెట్లామారిపోయాడో యెట్లావున్నాడో యెప్పుడు చూద్దామా అన్నట్టు.

ప్రొద్దువాలింది. సాయంత్రం జారిపోయింది. మునిమాపు మోరయెత్తింది. పున్నమినాటి చంద్రుడు చల్లని వెన్నెలతో చక్కగా పైకి లేచాడు.

బాలయ్య రాలేదు.

“ఇంకేం వస్తాడు” అన్నది పక్కింటి ఇల్లాలు రాజమ్మ నిరాశను వ్యక్తపర్చే నిట్టూర్పుతో.

“వొస్తాడు. మాటదప్పే మనిషి కాదు. ఏ రాత్రికైనా వొచ్చి తీరతాడు” అన్నది బాలమ్మ సడలని విశ్వాసంతో.

* * *

నాయుడిగారింట్లోని కోడి తొలికూతకే కరణంగారి భార్య లక్ష్మీదేవమ్మ నిద్రనుండి లేస్తుంది. లేవడంతో

దేవుని గదిలోకి వెళ్ళి, ఏడుకొండలవాని చిత్రపటానికి నమస్కరించి, తర్వాత వంటగదిలోకి వెళుతుంది. పాలకుండ ముందుపెట్టుకుని పెరుగుతీస్తుంది. శ్రావణపూర్ణిమ మరునాడు తెల్లవారుఝామున ఆవిడ వంటగదిలో తోడుబెట్టిన పాల నుంచి పెరుగు తీస్తుండగా—బాలమ్మ వొచ్చింది తట్ట నెత్తుకొని

"ఏమే బాలీ! రాత్రి మీ ఆయన వచ్చాడుటే!" అన్నది లక్ష్మిదేవమ్మ మీగడ దీసి పట్టిపిడతలో వేస్తూ.

బాలమ్మ బావురుమని యేడ్చింది.

"ఏమిటే! ఏం జరిగింది?" ఆదుర్దాగా అడిగింది లక్ష్మిదేవమ్మ.

పైట చెంగుతో కళ్ళుతుడుచుకుంటూ, మండిగం ప్రక్కన చతికిలబడింది బాలమ్మ.

"అర్ధరాత్రికాడ వొచ్చాడమ్మా! మళ్ళీ తొలికోడి కూతకే లేచివెళ్ళాడు. ఇంతకీ నారాత తిన్నగా లేదు. నాకు సుఖపడే గీతలేదు. మాయదారి దేవుడు మాపైనే చిన్న చూపు చూడాలా? స్టేషన్‌లో ఇద్దరు పోకిరీవాళ్ళు పోట్లాడు కుంటూవుంటే, యీయనే సూడటానికి పోయాడంట వూరి కేనే వుండగూడదూ! అసలే జాలిపేగులవాడాయె! పోట్లాట సర్దబోయాడంట. అందులో ఒకడు చాకుతీసి రెండోవాడ్ని యెదుర్రొమ్ముల్లో పొడిచాడంట. ఇద్దరి మధ్యవున్న యీయనపై రకతం చింది పడిందంట ఆపైన పోలీసోళ్లు వచ్చిపడిరంట. పొడిచినోడు పరిగెత్తాడంట. అక్కడున్న పెద్దమనుషులు యీయన్నిగూడా లగెత్తమన్నారంట.

ఈయన పరిగెత్తుంతుంటే ఓ పోలీసాయన వెంటపడ్డాడంట. పొలిమేరలదాకా వచ్చాడంట. అరటితోటలో దాక్కొని, ఆపైన సల్లగా అర్ధరాత్రి కొంపకొచ్చాడు. కొంపకొచ్చినా శాంతగా నిద్రపోయాడా! ఆ పోలీసోళ్ళను గురించే బెండు వడిపోయాడు చీకటితో లేచి వెళ్ళాడు. బస్సులో పోతాడంట మళ్ళీ తెల్లారితే పోలీసులొచ్చి పట్టుకుంటారని. చూడమ్మ గోరూ! మాఖర్మగాకపోతే యిదంతా యేమిటి?"

లక్ష్మీదేవమ్మ స్పష్టంగా సానుభూతి కనబర్చింది.

"అవునే బాలీ! కాలం అట్లావుంది". నేరం ఒకళ్ళదీ శిక్ష మరొకళ్ళకి. అరిటాకూ-ముల్లూ చందంగా వున్నాయి పరిస్థితులు. ఆ క్షణంలో మెడకు యేం చుట్టుకుంటుందో చెప్పలేము. మన జాగ్రత్తల్లో మనం వున్నా-ఇబ్బందులు దొర్లుకుంటూవచ్చి మనమీద పడుతూనే వుంటాయి."

బాలమ్మ దుఃఖాన్ని కన్నీళ్ళద్వారా బయటపెట్టి, పైట చెంగులో యిముడ్చుకుంది.

కరణంగారి భార్య దగ్గర మూడుసోలల పెరుగు వేయించుకొని, తట్టనెత్తుకుని-మరో ఇంటికి వెళ్ళింది బాలమ్మ. అక్కడా తన భర్తను గురించి అడిగిన ఇల్లాలికి అదే చెప్పింది. ఆ రోజంతా అదే పాఠాన్ని బాలమ్మ, గడప గడపకూ పొల్లుపోకుండా చదివి, సానుభూతిని సంతృప్తిమేరకు సంపాదించింది.

అది జరిగిన నెల తర్వాత, బాలమ్మకు నెలతప్పిందన్నవార్త పాకింది. ఆ వార్తను బాలమ్మ స్వయంగా

ధృథ పర్చింది. "యేమిటోపాడు...మళ్ళీఇన్నాళ్ళకు" అని సిగ్గుతో మల్లెమొగ్గయింది.

"శ్రావణ పూర్ణిమనాడు బాలయ్య వచ్చేవుంటాడు. ఆ ప్రభావం బాలమ్మలో కన్పిస్తోందికదా!" అనుకున్నారు కొంతమంది. "ఒఠిదే బూటకం. ఆమెకు నెలదప్పటానికి కాటా మేస్త్రీ వెంకటస్వామే కారణం. ఊళ్ళోవాళ్ళను మభ్యపెట్టడానికి బాలమ్మ నాటకం ఆడుతోంది" అనుకున్నారు మరికొంతమంది. యేమైనా బాలమ్మ గర్భిణీతో వుంది.

వెంకటస్వామి రాత్రుళ్ళు బాలమ్మ కొంపలోనే కాలక్షేపం చేస్తున్నాడు.

బాలమ్మకు భర్తదగ్గర్నుంచి ఉత్తరంవచ్చి చాలా కాలమైంది. ఆదుర్దాని మెడలో హారంగా వేసుకొని ఒక రోజు మధ్యాహ్నం కరణం కోదండరామయ్య దగ్గరకు వచ్చింది.

"నాకేదో భయంగా వుంది బాబుగారూ! మళ్ళీ ఆయన దగ్గర్నుంచి వుత్తరంలేదు. ఒకవేళ పోలీసులు గాని పట్టుకున్నారేమో!..."

కోదండరామయ్య నవ్వి నీ భయమేగానీ, మీ ఆయన పోలీసువాళ్ళకు చిక్కుతాడటే! అనవసరపు భ్రాంతితో దిగులుపడక, నిశ్చింతగా వుండు. ఎన్ని పనుల్లో వున్నాడో! త్వరలోనే వుత్తరం వస్తుందిలే" అన్నాడు.

బాలమ్మకు పదిమాసాలు నిండాక, మగపిల్లవాడు కలిగాడు. 'అచ్చు తండ్రిలాంటివాడే' అని బాలమ్మ

మురుసుకుందిగానీ, ఇద్దరు ముగ్గురు ముత్తైదువులు చాటుగా 'ఆ వెంకటస్వామిగాడి పోలిక లేపిల్లవాడికి' అనుకున్నారు. అప్పటికీ బాలయ్యవద్దనుంచి వుత్తరంముక్క రాలేదు.

*    *    *

బాలమ్మ కొడుక్కి మూడో నెల వచ్చింది.

వెంకట రత్నాకరరావు అని ముచ్చటగా పేరుపెట్టుకుంది. బాలమ్మ తండ్రిపేరు వెంకటరత్నం. దానికి కొంచ కొద్దిగా కలిపి, నాజూకుగా 'వెంకటరత్నాకరరావు' అని నోరార పిలుచుకుంటోంది.

అంత కాలం తర్వాత మళ్ళీ ఓ రోజు బాలమ్మకు హైదరాబాదునుంచి వుత్తరం వచ్చింది. ఆ వుత్తరం అందుకున్న మరుక్షణమే వూపిరి తిరగని ఆదుర్దాతో కరణం గారింటికి పరుగెత్తింది బాలమ్మ. నవ్వుతూ చూస్తోన్న కరణం గారు బాలమ్మ తొందరపాటును గమనించి, తన పని మధ్యంతరంలోనే ఆపి, ఆవుత్తరం చదివాడు. అది బాలయ్య వ్రాసిందికాదు. ఫ్యాక్టరీలో పనిచేసే తోటి వర్కరు.

"బాలమ్మకు—ఈ దుఃఖకరమైన వార్తను తెలియ బర్చటానికి మిక్కిలి విచార పడతున్నాను. మొన్న సాయంకాలం బాలయ్య ఫ్యాక్టరీలో ఓ యాక్సిడెంటుకు గురైనాడు డాక్టర్లు యెంత ప్రయత్నించినప్పటికీ బ్రతకలేకపోయాడు. నిన్న ఉదయమే మరణించాడు. ఆత్మకు శాంతి కలుగుగాక! తోటి వర్కరు రామచంద్రయ్య."

బాలమ్మ బిగ్గరగా గళం విప్పింది.

కరణంగారు కళ్ళజోడు తీసి, పై పంచతో కళ్లు తుడుచుకున్నాడు.

లక్ష్మీదేవమ్మ సానుభూతిగా ముక్కు చీదివేసింది. ఆ వుత్తరం పట్టుకుని బాలమ్మ యేడుస్తూ ఇంటికి వెళ్ళింది. వీధిలో 'అదేమిటి?' అని అడిగినవాళ్ళకు "యేముంది బాబయ్యా! ఇంటి దీపం ఆరిపోయింది! వెధవముండ నయ్యాను. దేవుడు కక్షబూనాడు" అంటూ దీర్ఘాలుతీస్తూ చెప్పింది.

వూళ్ళోవాళ్ళు చాలామంది స్త్రీలూ, పురుషులూ బాలమ్మ యింటికొచ్చి, ఆమె నోదార్చి సానుభూతి వాక్యాలను తోరణాలుగా కట్టివెళ్ళారు. రెండు మూడు రోజుల వరకూ బాలమ్మ దిగులుతోనే యింట్లో దిగబడిపోయింది. పెరుగుతట్ట నెత్తుకొని బస్తీకి వెళ్ళలేదు. బజారు ముఖం కూడా చూడలేదు.

రోజులు జరుగుతున్నాయి.

*　　*　　*

ఒకరోజు అర్థరాత్రి తలుపు తట్టబడగా నిద్రలోవున్న బాలమ్మ వులిక్కిపడిలేచి, 'వెంకటస్వామి వొచ్చాడేమో!' అనుకుంటూ, బద్ధకంగా వొళ్ళు విరుచుకుంటూ, ఆవలిస్తూ తలుపు తెరిచింది.

ఎదురుగ్గా బాలయ్య.

కళ్ళునులుముకొని, తేరిపారజూచింది బాలమ్మ.

అవును బాలయ్యే!

కలా? నిజమా?—నిలువునా నిర్ఘాంతపోయి కొన్ని క్షణాలపాటు నిలబెట్టబడిన రాతి విగ్రహంలా నిలబడింది బాలమ్మ.

బాలయ్య యింట్లోకివచ్చాడు. మనిషి చిక్కిపోయాడు గడ్డం మాసివుంది. ధరించిన చొక్కా ధోవతీ చిరుగులు పట్టివున్నాడు. ఆకారం రోత కలిగించేట్టుగా వుంది.

కోడిగుడ్డు లాంతరు కాంతిలో బాలమ్మ భర్తను చూసి పోల్చుకుంది. గజగజ లాడింది. గుండెల్లో కృష్ణా బ్రిడ్జీ మీదనుంచి జి. టి. ఎక్స్‌ప్రెస్ పోతూన్నంత దడదడ. ఒళ్ళంతా చమటతో తేమ తేమ అయింది.

“ఇంట్లో కూడేమైనా వుందా! ఆకలవుతుండాది” అన్నాడు బాలయ్య కడుపుమంట దూకుండగా.

కాళ్ళకింద భూమి క్రుంగిపోతుండగా, బాలమ్మ వంటగదిలోకి వెళ్ళింది.

తాటిబద్దెను కట్టివున్న వుయ్యాల్లోని ఆరునెలల పిల్లవాడ్ని చూసి, “యెవరే ఈ పిల్లాడు?” అన్నాడు బాలయ్య ఆశ్చర్యాన్ని ధ్వనింపచేస్తూ.

భర్త వేసిన ప్రశ్న బాలమ్మ చెవులకు సోకింది. గుండెలో తుపాకి గుండులా పేలగా, ఆమె నిర్విణ్ణురాలై నేలకొరిగినట్లు కూలింది.

బాలయ్య ప్రశ్నకు జవాబు లేదు.

మళ్ళీ కేక వేశాడు: ఎవరే వుయ్యాల్లో పిల్లాడు.

పెరటి దొడ్డి తలుపుతీసిన శబ్దం.

4)

ఆ పైన కొద్దిక్షణాలకే—ఎవరో బావిలో దూకిన పెద్ద చప్పుడు. బాలయ్య గబుక్కున వంటగదిలోంచి, పెరటిదొడ్డి బావి దగ్గరకు పరుగెత్తాడు, బావిలో బాలమ్మ నీళ్ళు మింగుతూ చావు బ్రతుకుల సంఘర్షణలో కొట్టు మిట్టుకులాడుతోంది.

బాలయ్య దిగ్భ్రమ చెందాడు కొన్ని క్షణాలపాటు అతనికి కాళ్ళు, చేతులు ఆడలేదు. విపరీతంగా భయపడ్డాడు. ఏమీ తోచక, తికమకబడి, చివరకు యింటి దగ్గర్నుంచి పరుగెత్తాడు చీకట్లోకి

తెల్లవారుఝామున వుయ్యాలలోని వెంకటరత్నాకర రావు ఏడ్పును అందుకున్నాడు. ఆ యేడ్పుకు లక్ష్మికూడా నిద్ర మేల్కొంది 'అమ్మా! అమ్మా!' అని పదిసార్లు కేక వేసింది. అమ్మ పలుకలేదు. ఉయ్యాల్లోని పసివాడ్ని సముదాయించటం తెలీక, లక్ష్మికూడా యేడ్చింది బిగ్గరగా ఇద్దరి పిల్లల యేడ్పులకు ప్రక్కయింటి యిల్లాలు రాజమ్మ మేల్కొని, అమర్దాగా బాలమ్మ యింటికి వచ్చింది.

పిల్లలు గుక్కపట్టి యేడుస్తున్నారు.

బాలమ్మను పిలిచింది. పలకలేదు. పెరుగుతట్ట అటకమీదే వుంది బాలమ్మకోసం వెతికింది. పిల్లలు నిర్విరామంగా యేడుస్తూనే ఉన్నారు.

—చివరకు బాలమ్మను బావిలో చూసి రాజమ్మ కెవ్వున అరచింది. తూర్పురేఖలు తెల్లగా విచ్చుకుంటూన్న ఆ సమయంలో—ఆ కేకకు యిరుగూ పొరుగూ యిళ్ళవాళ్లు పదిమందీ గుమిగూడారు.

బావిలో తేలుతున్న బాలమ్మ శవాన్ని చూసి అందరూ ఆశ్చర్యపోయారు.

బాలమ్మ యెందుకు బావిలో పడింది?

ఎందుకు ఆత్మహత్య చేసుకుంది?

అసలేం జరిగింది?—యెవ్వరికీ యేమీ అర్థంకా లేదు. ఒకళ్ళముఖా లొకళ్ళు చూసుకున్నారు.

—బావిలోపడి ఆత్మహత్య చేసుకున్న విషయం తెల్సికొని, కరణం కోదండరామయ్య వచ్చాడు. బావి లోంచి బయటకు తీయబడిన బాలమ్మ శవాన్ని చూశాడు.

......పాపం! అభాగ్యురాలు. యింతకాలంనుంచీ, ఊరినీ, వాడనూ మభ్యపెట్టి అవినీతిని కప్పిపుచ్చుకుంటూ బ్రతుకును నెట్టుకొచ్చింది. రాత్రి ఆమె జీవితానికి చివరి అధ్యాయం ముగిసిందన్నమాట! తనే ముగించుకుంది. ఎంత సాహసం చేసింది?... మొదట్నుంచీ సాహసంగానే ప్రవర్తించింది. ఆమె జీవితాన్ని గురించిన పెద్ద రహస్యాన్ని తను నిన్న సాయంకాలం బస్తీలో కాకతాళీయంగా తెల్సికో గలిగాడు. అసలు బాలయ్య హైద్రాబాద్‌లో లేడు. శ్రావణ పూర్ణిమకు వస్తాననలేదు రాలేదు. స్టేషన్లో పోట్లాటలో కల్పించుకొని పారిపోలేదు ఫ్యాక్టరీలో యాక్సిడెంటులో యిరుక్కుని చనిపోలేదు. అదంతా బాలమ్మ ఆడిననాటకం. ఆ వుత్తరాలు నాటకంలో పాత్రలు. బస్తీలో ప్లీడరు గుమాస్తాకి ఉత్తరానికి ఐదు రూపాయల చొప్పున యిచ్చి రహస్యం కాపాడేటట్లు ఆ వుత్తరాలు హైద్రాబాద్ పోస్టు చేయించేట్లు ఒప్పందం చేసికొని, ఇంతకాలమూ

ఊళ్లో ప్రజల్ని మోసం చేస్తూ, సానుభూతిని యెప్పటికప్పుడు పొందుతూ, తనస్థానాన్ని వూళ్ళో నిల్పుకొంటూ—వెంకటస్వామితో ప్రణయాన్ని సాగించింది. ఒకవేళ రాత్రి బాలయ్య వచ్చాడేమో! వెంకటస్వామివల్ల కలిగిన పిల్లవాణ్ని చూశాడేమో!...భర్తకు సంజాయిషీ యిచ్చుకోలేక బావిలోపడి ఆత్మహత్య చేసుకుందేమో!...అట్లాగే జరిగి వుంటుంది...సందేహం దేనికి? అనుకున్నాడు కరణం కోదండరామయ్య మనస్సులో నిశ్శబ్దంగా.

"అయితే కరణంగారూ! బాలమ్మ బావిలోపడి యెందుకు చనిపోయినట్టు" అన్నాడు పంచాయితీబోర్డు మెంబరు రామకోటయ్య.

"నాకునుటుకేం తెలుసండీ?" అన్నాడు కరణం కోదండరామయ్య ముక్కుపొడుం ఓ చిటికె పట్టిస్తూ. *



# పందిట్లో

పెళ్ళి సందడిలో పెళ్ళివారి యిల్లు కళకళ లాడుతోంది. పెళ్ళి పందిరి చూసేం కళ్ళు కైపెక్కేట్టుగా అలంకరించబడి వుంది. కళ్యాణ మహోత్సవ శోభ ప్రతివారి హృదయంలోనూ కమనీయ రాగాలాపనలకు తావు కల్పిస్తోంది. మరి లక్షాధికారి కూతురు పెళ్ళాయె. ఆరు సర్వేజానుల పొడవూ వెడల్పూ గల-నలుచదరమైన పందిరి. పందిరి చుట్టూ మామిడాకు తోరణాలు, రంగు కాగితాల గొలుసులు. పందిట్లో రబ్బరు బెలూనులు, రంగు కాగితాల బుట్టలూ తళుకు బెళుకుల పూలగుత్తులూ. పందిరి మధ్యలో పూసకూర్పు కళ్యాణ మంటపం. మంటపానికి నాలుగు ప్రక్కలా ట్యూబ్ లైట్లూ. పందిట్లో చాపలమీద జనం నిండుగా కూర్చున్నారు. వధూవరులు తూర్పు ముఖంగా మంటపంలో కూర్చున్నారు. వారి వెనుక భాగాన ఆడవారు కూర్చున్నారు. పందిట్లో పకపకలాడే కాంతికి వారుధరించిన పట్టు చీరలూ, పట్టుకుంటే మాసిపోయే జాకెట్లుంగా, రాళ్ళ నెక్‌లెస్‌లూ పెళ్ళివారి పందిరి గౌరవాన్ని ద్విగుణీకృత పరుస్తున్నాయి. పదేళ్ళలోపు పిల్లలంతా నిద్రాదేవింలో

కుస్తీపడుతూ మంటపం చుట్టూ చేరారు. అక్కడక్కడ కె. డి కె ఫేనులు నిర్విరామంగా సేవచేస్తున్నా, గాలి చాలక పెళ్ళి పెద్దలంతా విసనకర్రలతో విసురుకుంటున్నారు. ఇద్దరు కుర్రవాళ్ళు వెండి పన్నీరుబుడ్లు పట్టుకొని జనంమీదికి పన్నీటి జల్లు కురిపిస్తున్నారు ఇద్దరు పురోహితులు గుక్క తిప్పుకోకుండా మంత్రాలు చదువుతున్నారు, సన్నాయి వాళ్ళు పీకెలు సరిదిద్దుకుంటూ వుండగా బ్యాండు వాళ్ళు 'పెళ్ళికానుక'లోని పాటవాయిస్తున్నారు. రాత్రి పదకొండు గంటల ఇరవై తొమ్మిది నిముషములకు శుభముహూర్తం. అప్పటికే అందరికీ భోజనాలై పోయినాయి. పిల్లలు కొంత మంది నిద్రాదేవికి లొంగి తల్లుల ఒడుల్లో నిద్రబోతున్నారు మెడచుట్టూ కెమేరా తగిలించుకొని ఒక ఫోటో గ్రాఫరు కన్యాదానం చేస్తున్న దృశ్యాన్ని ఒకమెరుపు కురిపించాడు. పందిట్లో జనమంతా సర్దుకుని కూర్చున్నారు.

—పందిట్లో పెళ్ళవుతూన్నది.

ఆడపెళ్ళివారి తరఫున వచ్చిన చుట్టాల్లో మోహన్ అన్న పేరుగల తొమ్మిదేళ్ళ వయస్సుగల కుర్రవాడు ఎలాగో తల్లి దగ్గర్నుంచి తప్పించుకొని వీధి పందిట్లోకి వచ్చాడు. అక్కడ జనం ఎవ్వరూ లేరు. ఉన్నవాళ్ళు గుమి గూడి వాకిట్లో నిలబడి లోపల పందిట్లో జరిగే పెళ్ళిని చూస్తున్నారు. చంద్రుడు సహితం కొబ్బరిచెట్ల సందునుంచి పెళ్ళివైభవాన్ని తిలకిస్తున్నాడు.

వీధి పందిట్లో మురుగు కాలవ ప్రక్కన రెండు మూడు కుక్కలూ ఇద్దరు ముగ్గురు బిచ్చగాళ్ళూ, ఎంగిలి

విస్తళ్ళ గుట్ట చుట్టూ మూగివున్నారు. షార్క్‌స్కిన్ పొట్టి లాగు క్రింద సిల్కుచొక్కా వేసుకొని బెల్టు పెట్టుకొని మెడలో పులిగోరుతో వున్న బంగారపు గొలుసు, ఒకచేతికి బంగారపు ఎనామిల్ గడియారమూ, వ్రేళ్ళకు ఉంగరాలు ముచ్చటగా వున్న మోహన్ ఏమీతోచక ఎందుచేతనో ఆ పెళ్ళిసందడి గిట్టక అక్కడకొచ్చాడు. మురుగు కాలవ ప్రక్కన నిలబడి చూడసాగాడు. తన వయస్సులోనే ఉండి చొక్కా లేకుండా నల్ల గచ్చులా శరీరం వుండగా చినిగిన కాకిటెల్లులాగు తొడుక్కొని, నూనెలేక ఎర్రబడ్డ జుత్తు ముఖం మీదకు వ్రేళ్ళాడుతుండగా—ఎంగిలి విస్తరాకుల్ని ఎంతో ఆత్రంగా తింటూన్న ఓ కుర్రవాణ్ణి చూడటంతో మోహనుకు విపరీతమైన అసహ్యమూ, జాలి వేశాయి. బిచ్చగాళ్ళ జాతికి చెందిన ఆ కుర్రవాడు మోహన్‌ని గమనించకుండానే మీదపడే కుక్కల్ని ఒకచేత్తో నెట్టుతూ, సాటిబిచ్చగాళ్ళు తాను యామర్లితే ఆకుల్ని ఎక్కడ ఖాళీ చేస్తారోననే ఆదుర్దాకొద్దీ తింటున్నాడు ఆ కుర్రవాడికేసే మోహన్ మూడు నిముషాలపాటు దీక్షగా చూశాడు. ఎక్కడో చూసినట్లు మాట్లాడినట్లు లీలగాస్ఫురించింది, పలుకరించాడు.

«అదేమిటబ్బాయ్! ఎంగిలికూడు తినవచ్చా?» అన్నాడు మోహన్ ఆక్షేపణగా.

"ఏం?" అన్నాడా కుర్రవాడు ముఖంమీద పడే జుత్తు పైకి ఎగరేసే విసిలింపుతో ముఖం ఎత్తి.

"తప్పుకాదూ?"

"ఎందుకు?"

"ఒకళ్ళు ఎంగిలి చేసింది మరొకళ్ళు తినవచ్చా? పాపంకాదూ!"

కొరకొర నవ్వాడా కుర్రవాడు.

మాకేం పాపం? మేం పాపంలో పుట్టాం పాపంలో బ్రతుకుతున్నాం. పాపంలోనే చస్తాం. మాకేం పట్టింపు లేదు. మాది పాపాత్ముల కులం. దేవుడంటే మాకు భయం లేదు. మరి మంచికూడా మాకెట్లా వస్తుంది? అన్నాడు ఇంకో ఎంగిలి విస్తర్ని తెరుస్తూ.

మోహన్ ఒళ్ళు త్రాచుపామును చూసినట్లుగా జల్లుమన్నది. వేపకాయ గొంతులో యిరుక్కున్నట్లుగా ముఖమంతా వికారంగా కదులాడింది.

ఆ కుర్రవాడు సగం చీకివేసిన నూజవీడు మామిడి రసాన్ని చీకుతున్నాడు. పెళ్ళి జరుగుతున్న పందిట్లో భాజా భజంత్రీలు ఒక్కసారి వాయించటం ఆపారు. పురోహితుల మంత్రాలు తీవ్రంగా వినవస్తున్నాయి.

"మీదేవూరు?" అన్నాడు మోహన్ కొంచంసేపు మెదలకండా వూరుకుని

"ఒకవూరని ఏముందిబాబూ? అడుక్కు తినేవాళ్ళకు అన్నీ ఆను వూళ్ళు. ఎక్కడ పుట్టానో నాకు తెలయదు. ఎక్కడ బ్రతుకుతానో చెప్పలేను. ఎక్కడ చస్తానో - ఆ దేవుడికి తెలియాలి."

రెండు నిమిషాలపాటు నిస్సబ్దుడై నిలబడి ఏదో ఆలోచన బుల్లి బుర్రలో బరువుగా కదలగా గబగబా పెళ్ళి జరుగుతూన్న ఇంట్లోకి వెళ్ళాడు. అందరూ పెళ్ళి చూస్తున్నారు. మెల్లగా స్టోరు రూములోకి వెళ్ళాడు. ఒక విస్తట్లో రెండు లడ్లూ, రెండు అరిశలూ, ఒక బాదుషా గుప్పెడు కారపుపూసా, యింత పులిహోరా-పొట్లంగా చుట్టి బయటకు తీసుకొచ్చాడు. అతన్ని యెవ్వరూ అడ్డుపెట్టలేదు. అసలు గమనించినవాళ్ళే లేరు. ఆ పొట్లాన్ని మోహన్ ఆ కుర్రవానిచ్చాడు.

"ఇదిగో! నీ కడుపునిండా సంతోషంగా తిను."

ఆ పొట్లం అందుకున్న ఆ కుర్రవాని ముఖం ఆనందోత్సాహాలతో విశాలమైంది. గబగబా రెండు లడ్లు ఒకేసారి నోట్లో కుక్కుకున్నాడు. వాడు తినే ఆత్రాన్ని, మోటుపద్ధతిని తిలకిస్తూ నిల్చున్నాడు మోహన్. అట్లా ఆ తినే తీరు చూస్తూవుండగా మోహన్‌కు కాకతాళీయంగా ఒక ఏడాదిక్రితం విషయం జ్ఞాపకానికి వచ్చింది. ఆ కుర్రవాడ్ని తను ఎక్కడ చూసిందీ స్ఫురణకొచ్చింది. ఒక సంవత్సరం క్రితం గుంటూరులో అరండల్ పేటలో తన యింటిముందు తనూ యింకా కొంతమంది ఆటలాడుతూ, బంతి రోడ్డుమీదకు వెళ్ళగా, తను బంతి తేవటానికి రోడ్డుమీద పరుగెత్తుతూ, యెదురుగా వచ్చే లారీక్రింద పడబోతే - ఈ కుర్రవాడు తనని అడ్డుకొని రక్షించాడు. లేకుంటే తను ఆ లారీక్రింద చచ్చిపోయేవాడే! లేదా ఏకాలో చెయ్యో విరగ్గొట్టుకునే

వాడు. అప్పుడు తనను వాడ్ని మెచ్చుకుని ఏం కావాలి? అంటే 'కడుపునిండా తిండి' అన్నాడు వాడు చాల చిన్న కోర్కె కోరినందుకు తనకే నామోషి వేసింది. అప్పుడే ఇదే రేగినజుత్తూ, మట్టిగొట్టుకున్న ముఖమూ, చొక్కాలేని నల్ల రాతిలాంటి ఒళ్లూ. కళ్ళల్లో ఆకలి గోలా - మార్పు ఏమీ లేదు. అప్పుడు తను వాడ్ని వెంటనే యింటికి తీసికెళ్లి జరిగినసంగతి తల్లితో చెప్పి లడ్లూ, గారెలతో మంచి భోజనం పెట్టించాడు. ఆరోజుకూడా ఇట్లానే ఆత్రంగా ఒక్కసారే రెండు లడ్లూ నోట్లో కుక్కుకున్నాడు. పాపం! తిండిమీద అంత ఆపేక్షకాబోలు. తను తల్లి ఎంత బ్రతిమాలినా ఒక్క లడ్డూకూడా తినడు.

"నీ పేరేమిటి?" అన్నాడు మోహన్ వాడ్ని ఉద్దేశించి.

"దాసు"

అవును వాడేపేడు వాడిపేరుకూడా దాసే. మరి విజయవాడ ఎందుకొచ్చాడు? ఎందుకొచ్చాడేమిటి? చెప్పాడుగా - ఆడుక్కునేవాళ్ళకు అరవైఅరు వూళ్లని. పాపం! దాసు యెంత బీదవాడు? అంత బీదవాడెందుకైనాడు, భగవంతునికి అంత పగదేనికి? ఎందుకన్యాయం చేయాలి? దాసు మురికగా, చీరపీట్లలు కారుతూ, రోతగా ఉన్నాడే! జుత్తు నూనెలేక అట్లా రేగివుండే యెర్రగా, నూనె రాసుకో కూడదూ! కళ్ళు అంత లోతుకు పోయినాయేం? మెడ నరాలు, ప్రక్కటెముకలూ - బయటపడ్డాయేం? యీరోజు

అన్నం దొరకదా? వళ్ళంతా ముసుక్కులవంలోని బురదకి మల్లే వుండేం? నిత్యమూ స్నానము చేయడా? నీళ్ళకేం కరువు. వేడినీళ్ళు లేకపోతే చన్నీళ్ళ స్నానం చేయవచ్చుగా! బడికి వెళ్ళి చదవ్వకూడా? చదువుమీద ధ్యాసే లేదా? తనకి మల్లే దాసు సంతోషంగా పరిశుభ్రమైన దుస్తులు ధరించి, రోజూ బడికిపోతూ పదిమంది పిల్లలతో కులాసాగా ఆటలు ఆడుకుంటూ సినిమాలు చూస్తూ — ఎందుకుండకూడదు? వాడు సంతోషంగా వుండేందుకు రోజూ కడుపునిండా తిండి దొరకేందుకూ క్రమం తప్పకుండా బడికిపోయేందుకు, పరిశుభ్రమైన దుస్తులు ధరించేందుకు తనేమీ దాసుకు సహాయం చేయలేడా? ఎందుకు చేయలేడు? నాన్నగారివద్ద ఎన్నో వేల రూపాయలున్నాయి. వ్యాపారంలో ఎంతో డబ్బు సంపాదిస్తున్నారు, మేడ ఉన్నది. ఇంట్లో ఇనప్పెట్టెనిండా నోట్లు బంగారు నగలున్నాయి. తనెందుకు సహాయం చేయలేడు. సాటి బాలుడు అట్లా తిండికి ముఖం వాచి, కడుపు చేత్తో పట్టుకుని చదువుమీద ధ్యాసలేకుండా వూరూరా తిరుగుతూంటే — తను సహాయం చేసి, వాడి బ్రతుక్కు మేలు కలిగించటం తనధర్మం కాదూ! అనుకున్నాడు మోహన్. దాసును అడిగాడు.

"దాసూ! నువ్వెందుకు నాకుమల్లే వుండరాదు? మంచిబట్టలు కట్టుకోరాదు. రోజూ బడికెందుకు వెళ్ళకూడదు?"

వాడు నవ్వాడు వ్యంగ్యం వులిక్కిపడేట్లు.

"అదెట్లా బాబుగారూ! మీరు డబ్బున్నవాళ్ళు. మేం, బిచ్చగాళ్ళం. మీరు సుఖం అనుభవించటానికి పుట్టి నోళ్లు. మేం కష్టాల్లో కన్నీళ్లుకార్చటానికి పుట్టినోళ్ళం. మీకు మాకూ వంతెక్కడ బాబుగారూ!"

"దేవుడు మా ముఖాన యిట్లా బ్రతకమని రాత రాశాడు"

నీకూ డబ్బువుంటే మంచిబట్టలు కట్టుకుంటావా? కడుపునిండా తిండితింటావా? రోజూ బళ్ళోకి వెడతావా?"

"ఓ దివ్యంగా. కాని డబ్బు యెక్కడిది.

"నేనిస్తాను."

"మీరా!...ఇవ్వండి" అన్నాడు దాసుఆశ్చర్యంగా.

గబగబా జేబులో చేతులుపెట్టాడు మోహన్. కాని అవి ఖాళీ జేబులు. ఒక్కసారి గుక్కెడుఆముదం గొంతులో జారిన ముఖంపెట్టాడు. నాలుక కొరుక్కున్నాడు పెదాలు బిగపట్టాడు. మెల్లగా గొణుక్కున్నాడు! అరె! డబ్బుల్లేవే! ఉన్నాయనుకున్నాను. ఎట్లా ఏంచేయాలి? ఇప్పుడు అమ్మను అడిగినా యివ్వదే! రోజూ ఒక్కఅణామాత్రమే ఇస్తుంది. అదైనా బడికి వెళ్ళేటప్పుడు."

నిరాశతో నిట్టూర్పు బాణం విడుస్తూ చూశాడు దాసు మోహన్‌వంక ఆకాశవీధిలోకి వెళ్ళినవాడి ఆశ రబ్బరు బెలూన్‌లు పెనుగాలికి ఒకసారి పగిలిపోయినట్లయి నాయి.

తీవ్రమైన అవమానజ్వాలంతో కాగిపోతూ యిబ్బంది గా చూశాడు మోహన్ దాసుకేసి.

అమావాస్య చీకట్లో తారాజువ్వ వెలిగినట్టుగా ఓ చక్కని ఆలోచన దాసు బుర్రలో వెలిగింది. ముఖంలో సంతోషం సందడిచేయగా - "మీ దగ్గర డబ్బున్నది" అని కేకవేశాడు.

"నాదగ్గరా! లేదు. నేను అబద్దం ఆడుతున్నాననా!" ఖాళీజేబులు చూపెట్టాడు మోహన్.

దాసు చిరునవ్వు నవ్వాడు మోహన్ అమాయకత్వానికి.

"మీ మెడలో బంగారు పులిగోరు, మీ చేతిని ఎనామిల్ గడియారమూ, బంగారపు గొలుసూ, వ్రేళ్ళనున్న ఉంగరాలూ - అవన్నీ డబ్బుక్రింద లెక్కేగా! వాటిని డబ్బుగా మార్చటం నా చేతనవును."

"అయితే తీసుకో!" అంటూ జేబురుమాల్లో ఒక్కొక్క బంగారపు వస్తువా తీసి మూటకట్టి దాసుకిచ్చాడు.

ఆ నగల జేబురుమాలమూట చేత్తోపట్టుకున్న దాసు మనస్సులో - రూపాయలనోట్లు తోరణాలు: పెళ్ళిపందిట్లోని తోరణాలు పిలిప్స్ ట్యూబ్ లైట్ల కాంతిలో మెరిసినట్టుగా మెరిశాయి, ఇక ఒక్కక్షణం అక్కడ వుండబుద్ధిపుట్టలేదు. పారిపోయేందుకు అటూ ఇటూ చూశాడు.

"కొత్తబట్టలు కట్టుకుంటావుగా! రోజూ బడికిపోయి చదువుకుంటావుగా! కడుపునిండా తిండితింటావుగ" అంటున్నాడు మోహన్ తృప్తిపడుతూ.

దాసు కాళ్లూ చేతులూ వశంతప్పి వణుకు తున్నాయి. గాలిలో తేలిపోతున్నాయి. గడ్డి పోచల పగిది. వెంటనే పరుగెత్తుదామనుకున్నాడు. కాళ్లు ముందుకు వడిగా పడటంలేదు. అక్కడనే బలవంతాన రెండడుగులు ముందుకు వేశాడు. అంతలో ఓ బలమైన చేయి అతని మెడను గట్టిగా పట్టుకుంది. దాసు పాదాలు భూమి మీద ఆనలేదు. గడగడలాడిపోయాడు. ప్రాణాలు గాలిలో కలియటానికి అజీలుగా వున్నాయి.

మోహన్‌ను వెతుక్కుంటూ యిద్దరు దిట్టమైన పని మనుషులొచ్చారు.

"ఏమిట్రా! దొంగవెధవా! పిల్లవాడ్ని మాయచేసి నగల్ని తీసికెళ్తావా?" అంటూ ఆ జేబుకుమాలుమూట లాక్కొని ఒక్క తన్ను తన్నాడు ఒకాయన.

మురుగుకాలువ ప్రక్కనపడ్డాడు దాసు బిళ్ళంగోడుకు మల్లే. కత్తెర గాయికి ముఖం కొట్టుకొని – చెంప చెక్కుపోయి నెత్తురు చిమ్మింది. ఇంకోకాయన పీకపట్టుకొని పైకి లేపి, వీపుమీద అయిదుట్రవేళ్ళ ముద్రవేశాడు.

"నేనేపాపమూ ఎరగను బాబూ! ఆయనే ఇచ్చాడు" అన్నాడు దాసు ఏడుస్తూ.

"అవును నేనే యిచ్చాను. మీరు కొట్టకండి తప్పు. పాపం వాడిదేమీ తప్పులేదు. వీడు నన్ను మాయచేసి చేయలేదు. వాడు దొంగకాదు" అన్నాడు మోహన్ ఆవేశంతో. కాని మాటల్ని ఎవ్వరూ వినిపించుకోలేదు.

"ఏ పాపమూ ఎరగవా? అడ్డగాడిదా! నీ ప్రాణాలు తీస్తాను" అంటూ డొక్కలో మోకాలితో పొడిచాడు ఒకాయన.

పందిరి సర్వీబాదుకు తలకొట్టుకొని బోర్లా పడ్డాడు దాసు. తల చిల్లిపడింది. నెత్తురు బయటికొచ్చింది.

ఇంకోకాయన మోహన్‌ను పెళ్ళిపందిట్లోకి లాక్కెళ్ళి తల్లిదగ్గర కూర్చోబెట్టాడు. నగలమూటను యిచ్చాడు. కొడుకుని కౌగలించుకొని, తల్లి నగల్ని లెక్కచూచుకుంది. అన్నీ వున్నాయి. **పందిట్లో**

పందిట్లో పెళ్ళవుతూన్నది. మంగళసూత్రధారణ అయిపోయింది. వధూవరులు తలంబ్రాలు పోసుకోనేఘట్టం వచ్చింది. బ్యాండూ, సన్నాయి మేళాలు జోరుచేస్తున్నాయి. పెళ్ళి చూస్తూన్న జనంలో నూతనోత్సాహం వచ్చింది. తలంబ్రాలు పోసికోవడంలో పిల్లవాడు ఘటికుడా, పిల్లగట్టిదా చూడాలనే ఉబలాటం అందరి మనస్సుల్లోనూ గిలిగింతలు పెడుతూన్నది. పిల్లల ఉపాయం వర్ణించటానికి వీల్లేదు. కాని మోహన్ మనస్సుమటుకు నీరుదిగిన ఉంగరపురాయివలె బెంగతో క్రుంగిపోతూంది. దాసును ఏంచేస్తున్నారో - అని దుఃఖపడుతూంది. బయటికి వెళ్ళి దాసును రక్షించుదామన్న కోర్కె వూగులాడుతూంది. గాని - తల్లి గట్టిగా రెండుచేతుల్ని చుట్టి యెక్కడకు పోకుండా అదిమి పట్టింది.

పురోహితుడు మంత్రాలు చదువుతూ, వరుడు దోసెడుతో తలంబ్రాలు పట్టించి, గరికముంత చూపి, ఎండు కొబ్బరిచిప్ప పెట్టి, తమలపాకుతో నీళ్ళుచల్లి వధువుమీద పోయించేందుకు సిద్ధంగా వున్నాడు. బ్యాండూ, సన్నాయి, తాషా మర్ఫాలు పెళ్ళి పందిర్ని అదరగొడుతున్నాయి.

కాని బయట పందిట్లో దాసు మురుగుకాలువ ప్రక్కన నెత్తురుకక్కి గుడ్లు తేలవేసి నేలకు కర్చుకొని పడివున్నాడు. ఎంగిలి విస్తళ్ళు జాలిగా కన్నీళ్ళు కార్చాయి.

పందిట్లో పెళ్ళవుతూన్నది.

# విముక్తి

మబ్బులు దట్టంగా పట్టినయ్. చీకటిరాత్రి. ఇంకా వానపడటం లేదు పడే సూచనలు హెచ్చుగా ఉన్నాయి. తేమతో కూడుకున్న ఒక మోస్తరు గాలి. ఉరుములు అట్టే లేవు. కాని మెరుపులు జాస్తిగానే ఉన్నాయి. బ్రహ్మాండంగా వాన కురుస్తుందనే ఉద్దేశ్యంతోనే కోటయ్య ఎనిమిది గంటలకు కిల్లీ దుకాణం మూసివేసి కొంపకు చేరుకున్నాడు. స్నానం చేయకుండానే యింత కూడు తిని మంచం ఎక్కాడు. పల్నాటి ముతక దుప్పటి నిండుగా కప్పుకొని, ముసుగదీసుకొని నులక మంచం మధ్యలో కూర్చున్నాడు.

తొమ్మిది గంటలు అవుతుందేమో!

అప్పుడే ఎట్లా నిద్రవొస్తుంది?

ఆలోచనలో పడ్డాడు. కోటయ్యకు యీ మధ్య ఆలోచనలు జోరుగా వొస్తున్నాయి. తన బ్రతుకులోని తప్పటడుగుల్ని ఎక్కడకు అక్కడ ఖండితంగా విమర్శించుకొని జూస్తున్నాడు. అందుచేతనే కోటయ్యకు ఆలోచనలు!

లోపల పెళ్ళాం ఏంచేస్తూందో – అనుకున్నాడు.

వెధవది తాటాకుల కొంప కావటంచేత, బయట ఎంత చలి ఉందో లోపలా అంత చలి ఉన్నట్లు అనిపిస్తోంది. పెళ్ళాం ఏం చేస్తూందో – కుక్కి మంచంమధ్యలో కూర్చునే గ్రహించాడు కోటయ్య.

రాత్రి తొమ్మిది గంటలప్పుడు తన భార్య నిత్యమూ ఏం చేస్తూ వుంటుంది?

సిరి చాపమీద కూర్చుని, ముక్కాల పీటమీద లాంతరు బుడ్డి పెట్టుకొని, చాపమీద అద్దం ఉంచుకొని, తల దువ్వుకొంటూనో, తలలో పువ్వులు పెట్టుకొంటూనో, ముఖానికి 'సున్నం' పులుముకుంటూనో, వొంటికి అత్తరు రాసుకుంటూనో – ఉంటుంది.

అదంతా ఎవరికోసం? ఎవరి ఆనందంకోసం?

తడికె తలుపు మెల్లగా కదులాడింది. కోటయ్య గబుక్కున చూపు అటు మరల్చాడు. తడికె తలుపు మెల్లగా తెరుచుకున్నది. జగ్గయ్యగారు లోపలకు అడుగు పెట్టాడు. ఇల్లంతా పరిమళంతో 'గుఫ్' మన్నది. జగ్గయ్యగారు బుర్ర మీసాలను సవరించుకొని, పేటంచు పట్టు కండువాను లాక్కుంటూ – ఆ తాటాకుల కొంపకు యజమానీ, ఆ కొంపతాలూకు ఇల్లాలికి మొగుడూ, కుక్కి మంచం మధ్యలో అయిదు అంకెవేసి కూర్చున్న కోటయ్యవంక ఏప్పవటు కాలమైనా చూడకుండా నేరుగా లోపలకు వెళ్లాడు.

కోటయ్య పళ్లు పటపట కొరికాడు. కాని ఆ చప్పుడు వినేవా రెవరు?

కొద్ది నిముషాలకే పెళ్ళాం నవ్వు, జగ్గయ్యగారి నవ్వూ వినిపించాయి సన్నగా. కోటయ్య కోపంతో అరిచేతులు నలుపుకున్నాడు. క్రింద పెదాన్ని పంటితో నొక్కిపట్టి తీవ్రంగా ఆలోచించాడు.

మరికొన్ని నిముషాలకు భార్య సూరమ్మ పడకగది తడికె తలుపు వేసింది. ఆ తలుపు మూయటాన్ని చూసిన కోటయ్య కోపంతో తల్లక్రిందులై కుక్కి మంచంచుట్టూ గింగిరాలు తిరిగాడు.

ఇంకా కొన్ని నిముషాలకు పడకగదిలోని కోడిగుడ్డు లాంతరు కాంతి కొంచెం తగ్గటాన్ని కోటయ్య కళ్ళారా గమనించాడు. అతనిలో కరుడు గట్టుకొనిపోయిన మానవత్వం ద్రవించింది. నరాలు వేడెక్కినయ్. కళ్ళు ఎరుపెక్కినయ్. కోపం ఎగదట్టి నాసికా రంధ్రాలనుంచి బుసల రూపంలో వొస్తోంది. కుక్కిమంచం కిర్రుమన్నది. కప్పుకొన్న దుప్పటిని విసిరి నేలకేసి కొట్టాడు కోటయ్య. దణ్ణాన ఉన్న పంచెను తీసికొని బిగించి తలగుడ్డ చుట్టాడు—

“ఆ జగ్గాయిగాడు... లోపల... నవారు మంచంపైన, దూది పరుపుమీద... కోడిగుడ్డు లాంతరు వెలుగులో... తన పెళ్ళాంతో ఏంచేస్తున్నాడు?” అటూ ఇటూ పచార్లు చేస్తూ ఆలోచిస్తున్నాడు. తను ఇప్పుడు ఏం చేయాలి? ఇట్లా ఎన్నాళ్లు సహిస్తాడు? సంవత్సరంనుంచి ఎట్లా సహిస్తూ వొచ్చాడు?

సన్నగా నవ్వు వినిపించింది లోపలనుంచి.

కోటయ్య ఆవేశం కొద్దీ తడికె సందుల్లోంచి లోపలకు చూశాడు.

జగ్గయ్య వొళ్ళో కూర్చుని – అతని నల్లని మెడపైన రెండు చేతులూ వేసి, ముఖానికి ముఖందగ్గర చేర్చుకోంది. అతను నడుం చుట్టూ చేతులు వేసి బరువుగా దగ్గరకు లాక్కుంటున్నాడు

కోటయ్యలో నిప్పు రవ్వలు చెలరేగినై. అతని శరీరం కరాళ రూపం ధరించింది. కోపోద్రేకంతో పిచ్చివాడైనాడు. తన కళ్ళముందే ఇంత అవినీతా! మొగుడు ఇంట్లో ఉండగానే పరాయి మగవాడి వొళ్లో కులకడమా? దాన్ని ఏం చేస్తే పాపం ఉంది? వాళ్ళి నరికితే కోపం చల్లారుతుంది?

కొంగున అటకమీదనుంచి కోళ్ళను నరికే కత్తి తీశాడు కోటయ్య. వాళ్ళ నిద్దర్ని నరికి పోగులు పెట్టాలి. అప్పుడుగానీ తను సరైన మొగవాడు కాదు! కత్తి భుజాన పెట్టుకొని ముందుకు దూకాడు కోటయ్య. కాని తీరా పడకగది తడికెను తన్నేందుకు కాళ్ళు రాలేదు. గడగడ వొణికాయి గుండె 'జివ్వు' మన్నది. చేతుల్లో 'చేవ' చప్పగా అణగారిపోయింది. మనస్సు వెనక్కు పీకి గుండెలో ధైర్యం జారిపోయింది. కళ్ళముందు – జైలు గోడలూ, ఉరిత్రాడూ నాట్యం చేశాయి. భుజంమీద కత్తి దానంతట అదే క్రిందకు జారింది. జుట్టు పీక్కున్నాడు. కళ్ళల్లోకి నీళ్ళు చిమ్మాయి.

వెళ్ళి కుక్కి మంచంలో పడుకొని పల్చాటి దుప్పటిని గొంతుమట్టుకు కప్పుకొని ఆలోచించ నారంభించాడు కోటయ్య.

ఛీ ఛీ... తను బ్రతుకుతున్న బ్రతుకు ఎటువంటిది? ఎంత నీచమైంది? తన కళ్ళ ఎదుట, కట్టుకున్న భార్య వ్యభిచరిస్తూంటే చూస్తూ వూరుకున్నాడు తన కళ్ళ ఎదుట పరాయి పురుషుడి వొళ్ళో కూర్చుని కమ్మగా కబుర్లు చెబుతూంటే. ఏమీ చేయలేని అసమర్థతతో కుమిలి పోతున్నాడు. తనలోని ఇంత సహనం ఎందుకోసం?

డబ్బుకోసం...

డబ్బుకోసం తను భార్యకు పూర్తి స్వాతంత్ర్యం ఇచ్చాడు. డబ్బుకోసం తను భార్య చేసే అవినీతికరమైన పనుల్ని సహిస్తూ వొస్తున్నాడు. డబ్బుకోసమే అవమానమూ, అప్రదిష్టా, భరిస్తున్నాడు. సంఘంలో వ్యక్తి విలువల్ని మొదలంటా నాశనం చేసే ఇటువంటి తుచ్ఛమైన డబ్బు సంపాదించి - తను ఏం సుఖాన్ని అనుభవిస్తాడు? ఆ డబ్బు తనకు దేనికి? స్త్రీ చేత చేయరాని పనులు చేయించి, జన్మకే మాయని మచ్చగా నిలిచే అవినీతి కార్యాలను చేయించి, ఆ డబ్బుతో తను బ్రతకటమా? ఏం అంత హీనంగా బ్రతక్కపోతే?

తనలాంటి భర్తలు లోకంలో వుంటారా? ఇంత నైచ్యమైన భావాలుగల పురుషులు వుంటారా? తనలో మానవత్వం ఏమైంది? తన స్త్రీ పరాయి పురుషుని ప్రక్కన పడుకొన్నప్పుడు - తనలోని పురుషత్వం ఏమైంది? తనకు

భర్తగా, సుగవాడుగా – ఎంత అవమానం; సంఘంలో ఎంతఅగౌరవం; నీతి విషయంలో ఎంత దారుణం! వ్యక్తిలో నైతిక విలువలు పడిపోయినప్పుడు – ఆ వ్యక్తి ఇంకా బ్రతికినా, చచ్చినా ఒక్కటే! ఆ సత్యం తనకి ఇప్పు డిప్పుడే అర్థమౌతూంది. విముక్తి

తను ఎన్నడూ యీ పీతిని గూర్చి ఇంతగా ఆలోచించ లేదు. ఎట్లా ఆలోచిస్తాడు ? తను పరిస్థితుల పద్మవ్యూహంలో ఇరుక్కుపోయాడు : పరిస్థితుల వారసుడుగా మారిపోయాడు... లేకపోతే తను ఇంత వాజమ్మగా, దద్దమ్మగా తయారు కావట మేమిటి! ఆ రోజుల్లో తనంటే ఊళ్ళో 'జల్సా పురుషుడు' అని ఎంతపేరు ?

అప్పటికి భార్యా కాపురానికి రాలేదు. తను తీసుకు రాలేదు. ఏవో పేచీలు వొచ్చి పిల్ల తండ్రి పంపించనంటే పూరుకున్నాడు తను వొత్తిడి పెట్టలేదు. తనకి భార్య అవసరం ఏముంది! ఎంతమంది ఆడవాళ్ళు ? గూడెంలో – రత్తి, వెంకటసుబ్బి, మరియమ్మ; దొమ్మరిపాలెంలో – శశిరేఖా, వెంకటలక్ష్మి, చాకలిపేటలో – మాచెమ్మా, గోవిందమ్మ, వెంకటనర్సి – ఎంతమంది ? వాళ్ళంతా తన చిరునవ్వుకోసం వేచి ఉండేవాళ్లు; తన జేబుయొక్క బరువు చూసి మురిసిపోయేవాళ్ళు. తను పెద్దాపురం సిల్కులాల్చీ ధరించి, గ్లాస్కో పంచెకట్టి, వొంకులజుత్తు పైకిదువ్వి, నల్ల కళ్ళజోడు పెట్టి, కాన్పూరు చెప్పులు తొడుక్కొని వీధిన వెళుతూంటే– సంసార స్త్రీలల్లో మటుకు ఎంతమంది

కిటికీల్లోంచీ, వోరగా వేసిఉన్న వీధి తలుపుల సందులనుంచీ చూసేవాళ్ళు కాదు? తన దర్జా ఆ ఊళ్లో వంద ఎకరాల అసామీ సుబ్బయ్యగారికీ, మున్సబుకొడుకు మోహన రావుకూ, ఎం. బి. బి. యస్. చదువుతూన్న చౌదరికొడుకు చలపతిరావుకూ లేదని చెప్పుకొనేవాళ్ళు. తను టవునుకు వెళితే ఎంత మర్యాద? కారుల్లో, రైళ్ళలో, సినిమాహాల్లో ఏ పెద్ద షావుకారోనని ప్రత్యేకత చూపించే వాళ్ళు. ఒక సారి బందర్లో, వృత్తిలో పేరు గడించిన రాజహంస ఇంటికి వెళితే – ఆమె తనని ఎంత మర్యాదగా చూసింది? తన మీద ఎన్ని టక్కులు ఉపయోగించింది? తనకి ఎంత సౌఖ్యాన్ని ఇచ్చింది? తనకి యాభై ఎకరాల బంగారం లాంటి మాగాణీ భూమి ఉన్నదనీ, పదెకరాల పసుపు దోటలూ, అయిదెకరాలు నిమ్మతోటలూ ఉన్నవనీ, రైసు మిల్లుల్లో పది అణాల భాగమూ, తెనాలి – టాకీసులో ఆరు అణాల వంతూ ఉన్నవని తను కోసిన లేతలేత సారకా యలకు రాజహంస బోల్తోపడలేదా! తను తెల్లవారు ఝామున పాతిక రూపాయలు ఇవ్వబోతే 'వొద్దు లెండి, ఈతభా వొచ్చినప్పుడు ఇద్దురుగానిలే' అంది. మళ్లీ తను దాని గడప తొక్కాడా?

...అటువంటి తను ఎట్లా మారిపోయాడు? కాల మహిమ! ఒకసారి పిల్లనిచ్చిన మామ వొచ్చి 'మీ ఆవి డను తీసుకెళ్ళు. ఎన్నాళ్ళు మా యింట్లో ఉంచుతావు, పేచీలను పరిష్కరించుకుందాం!' అన్నాడు. తనకి పెళ్లాం మీద మోజు కలిగింది. రోజూ వేశ్యారు స్త్రీల కౌగిలింతల

అనుభవాల్లోని ఆనందాన్ని పొందుతూన్నా బ్రతుకు మూడు పువ్వులూ - ఆరు కాయలుగా జరిగిపోతున్నా, ఏమిటో ఇంటికి వచ్చేప్పటికి, ఎదురూగ్గా గుమ్మంలో నిలబడి సహజాలంకరణాలతో, సంతోషప్రదమైన చిరునవ్వులతో, ఆహ్వానించే భార్య ఉండాలని. ఏ వేళకు ఏ కష్టం వొచ్చినా కంటిమీద కునుకు లేకుండా పరిచర్య చేసే ఒక స్త్రీ ఉండాలని, ఏ సమయంలోనైనా సుఖం లభించాలంటే డబ్బులు పెట్టి కొనుక్కొనే ఖర్చు తగ్గుతుందనీ భార్యను తెచ్చుకున్నాడు కాని తను అనుకొన్నట్టు జరగలేదు. భార్యంటే తనకి అవసరం వొచ్చినప్పుడు తగిన ఆనందాన్ని యిచ్చే ఒక యంత్రమనీ, తను ఏది చెబితే అలా సహించే బానిసా, ఎన్ని కష్టాలు వచ్చినా ముఖాన్ని విసిరిపెట్టకుండా మొండి ధైర్యంతో పరిస్థితుల్ని ఎదుర్కొనే పాతివ్రత్యపు పటిమను చూపే స్త్రీ అనుకున్నాడు. కాని తన భార్య తనని లోకశారు అభిప్రాయాలనీ, ఈ కాలంలో ఆ భావాలకు స్థానం లేదని - తాను చెప్పినట్టుగానే మొగుడు నడుచుకోవాలని కొన్ని సవరణలను ప్రవేశపెట్టింది. కొత్తలో భార్యను ఇచ్చే మర్యాదలో ఉన్న ముందూ - వెనుకా ఆలోచించకుండా, ఆ సవరణలను ఆమోదించి, ఆమె కొంగు పట్టుకుంటేనే కైవల్యానికి హైరోడ్డు ఏర్పడుతుందనే తలంపుతో తిరగడంతో - ఆమె అతి సులభంగా, అతి నేర్పుగా వశం చేసుకుని, తనని ఎందుకూ పనికిరాని వాడ్నిగా తయారుచేసింది. ఆమె ఏపని చేసినా తను ఒప్పుకునేట్టు, ఆక్షేపణ తెల్పేందుకు అర్హత లేనట్టూ చేసింది.

తనకి కొట్టుమీద వచ్చే ఆదాయం తగ్గింది. పెళ్ళాం వొచ్చాక ఖర్చులు పెరిగాయి. దాని చీరలకూ, జాకెట్టులకూ, వాసన నూనెలకూ, పౌడర్లకూ, రిబ్బన్లకూ ఎక్కడి డబ్బూ చాలటంలేదు. పైగా వారానికి ఒకసారి తెనాలి తీసికెళ్లి సినిమా చూపించి రావాలి! తనకొట్టు ఎదురుగానే నరసింహాం కిళ్ళీ కొట్టు తెరిచాడు. అప్పట్నుంచీ తనకొట్టు బేరాలు బొత్తిగా దిగనాసిల్లిపోయాయి. అప్పులు ఎక్కువైనాయి. రొక్కం అగపడటం లేదు, బాగా రాబడివొచ్చే రోజుల్లో తను మిగిల్చింది దమ్మిడీలేదు. ఎప్పటి రాబడి అప్పటి జల్సాలకూ, అందువల్ల వొచ్చిన రోగాలకూ ధూపంలాగా కరిగిపోయేది. రోజులు గడ్డుగా ఏర్పడ్డాయి. ఏపూటా కోడిగుడ్డు, మేక మాంసమూ లేనిదే ముద్ద ఎత్తని తనూ, భార్యా-దోసకాయల కూరలోకి దిగింది పరిస్థితి. కొన్నాళ్ళు కొట్టు మూసివేసి బాకీల వసూళ్ళకు తిరిగాడు. వసూలు అయినంత వరకు వసూలైనాయి మళ్ళీ కొట్టు తెరిచాడు. కాని అప్పులవాళ్ళ జోరు ఎక్కువైంది. కాని డబ్బు రొక్కం రాలటం లేదు. రోజులు గడవక పెళ్ళాం మెడలో రెండు పేటల బంగారు గొలుసు తాకట్టుపెట్టి డబ్బు తెచ్చాడు. ఆ తాకట్టును తీర్చలేక గొలుసుకు తలోదకాలు ఇచ్చాడు తను. అప్పటినుంచి భార్య దృష్టిలో తను మరీ లోకువైనాడు. 'పెళ్ళానికి కూడు పెట్టలేని అసమర్థుడు' క్రింద ఆమె తనని కట్టింది. తనంటే తుస్కారంగా చూడ నారంభించింది. తను ఏంచేస్తాడు? కోరలు తీసిన పాములాగ అయిపోయినాడు.

7)

...ఆ సమయంలో జగ్గయ్యగారు ఎట్లానో ఒకసారి దానితో మాట్లాడాడు. జగ్గయ్యగారికి తెన కిళ్ళీకొట్టులో ఖాతా వుంది. ఆయన జల్సా పురుషుడు. పది ఎకరాల మాగాణీ, నాలుగెకరాల పసుపుతోటమెట్టా ఉన్నవి. పిల్లలు లేరు. జీతగాడితో కబురుచేసి, దాని మనస్సు కనుక్కొని బెంగుళూరు సిల్కుచీర కానుకగా పంపాడు. ఆ సంగతి తనకి మొదట్లో తెలీదు. జగ్గయ్యగారు తెను ఇంట్లో లేనప్పుడు రాకపోకలు సాగించాడు. తర్వాత తనకి తెలిసినా దాన్ని ఏమనలేక పోయాడు. తనలోని మెతకదనాన్ని కనుక్కొనే ఆమె ఆటలు ఆడుతోంది...

మళ్ళీ తన జేబులో డబ్బులు గలగల లాడినై: దాని మెడలో రెండువందల యాభైరూపాయల నెక్‌లెస్ మెరిసింది. కోడిపలావూ, కైమా వుండలూ, రొయ్యపొట్టు చారూ— మళ్ళీ తమః ఫలహారాలుగా మారాయి. తను మామూలు జల్సా పురుషుడైపోయాడు. ఖర్చులకి చాలినంత డబ్బు లభిస్తూంది. రోజులు తేలిగ్గా దొర్లిపోతున్నాయి...

కాని తను బ్రతుకుతూన్న బ్రతుకు ఏం బ్రతుకు? చీమూ, నెత్తురూ, మానవత్వమూ, అభిమానమూ, జ్ఞానమూ, నీతీ, ఉన్న వ్యక్తి బ్రతికే బ్రతుకేనా యిది? భార్య నీచకార్యం చేస్తూ గడించినడబ్బుతో తను సౌఖ్యాన్ని పొంద జూడడం! అంతకంటె నీచం మరొకటె వుంటుందా? తనకు నీచమూ, అవినీతీ యేమిటి? తను గడిపిన జీవితం ఎంత నీచంతోనూ, అవినీతితోనూ కూడుకొని లేదు! ఈ నాడు తనభార్యకూడా అదే ఒరవడిలో జీవితాన్ని నెట్టుకు

వెళుతూంటే — తనెందుకు బాధపడాలి? తనకేం నామోషీ? తనకేం అవినీతి? అని మొదట్లో అభిప్రాయపడ్డాడు కానీ, అది సబబుగా లేదు తను బ్రతుకుతూన్న సంఘంలో అది ఎంత నీచమైనదో, సాంప్రదాయ విరుద్ధమైనదో, అవినీతిని ఆరాధించేదిగా పరిగణింపబడుతూందో అర్థమౌతుంది. ఒక వ్యక్తి తాను అవినీతి జీవితాన్ని గడుపుతూ అటువంటి అవినీతి సమాజంలో ప్రబలటాన్ని సహించటం, సానుభూతి తెల్పటం, ఎంత అవివేకంతోనూ, అజ్ఞానంతోనూ, రాక్షసంతోనూ కూడుకున్నదో తనకి తేటతెల్లమవుతుంది! భార్య చేసే అవినీతిని తను ఎట్లా సహిస్తూ వొచ్చాడు? తనలోని మానవత్వం అంతగా నశించిందా? తనలోని అభిమానం అంతగా కరుడుకట్టిందా? తనేమన్నా పురుషత్వం లేని వాజమ్మా! తను ఆ విధవ డబ్బుకోసం జీవితాని కంతటికీ ప్రముఖమైన పాత్ర వహించే 'నీతి' విషయంలో పప్పులో కాలువేశాడు. తను నిత్యమూ అనేక దృశ్యాలు సమాజంలో చూస్తూవుంటాడు. ఒకసారి వీరయ్యకొడుకు జానయ్య, తన పెళ్ళాం ప్రక్కఇంటి వీరభద్రయ్యనుచూసి చిరునవ్వు నవ్విందని చింతాడు తీసికొని చచ్చేట్టు బాదాడు. కోటిలింగం తను ఊళ్లో లేనప్పుడు, ఒకసారి తనభార్య బొట్టు చెరిగిందనీ, చీరె నలిగిందనీ, జాకెట్టు చినిగిందనీ, వెర్రి అనుమానాలతో జుట్టుపట్టుకొని చచ్చేట్టు కొట్టాడు. ఒకసారి తన వెంట వచ్చినందుకు చాకలి సుబ్బడు కూతుర్ని నెత్తురు కక్కేవరకూ కొట్టాడు. కాని వీరయ్య కొడుకు జానయ్య ఒకసారి పసుపు తోట చేనులోకి కలుపుతీయటానికి వొచ్చిన కూలిమని

పైట చెంగు పట్టుకు కందిచేనులోకి లాగినందుకు ఎన్ని తిట్లు తిన్నాడు? కనుచీకటి పడగానే కోటిలింగం ఎన్నిసార్లు ప్రక్క జేబులో దూకంగు ప్రయోగించుకుంటూ దొమ్మరిపాలెం కేసి వెళ్ళలేదు! వీళ్ళందరూ సమాజంలో నీతిమంతులే! తనూ అట్లా ఎందుకు కాకూడదు? తనూ తన పెళ్ళాన్ని చావచితక కొట్టి నీతిపట్ల తన శ్రద్ధనూ, జాగ్రత్తనూ ఎందుకు నిరూపించుకోకూడదు? కాని తన భార్యకూ వాళ్ళ భార్యలకూ తేడావుంది. వాళ్ళెవ్వరూ భార్యలక్రింద చవటలు కారు. తను చవట! తన పెళ్ళాన్ని చావమోదటం ద్వారా ఆమె యొక్క అవినీతిని అరికట్టలేడు. ఏదైనా మార్గం ఆలోచించాలి...ఎట్లానైనా తను ఈ నీచపు శృంఖలాలనుంచి విముక్తిని సాధించాలి. భార్యకు సమాజంలోని వ్యక్తికి 'నీతి'కి గల సంబంధాన్ని అర్థమయ్యేట్టు తెలుపుకుచేయాలి. ఇప్పటికే తన అసమర్థత్వాన్ని గురించి, తన భార్యకూ కొంతమంది పెద్దమనుష్యులకూ గల సంబంధాన్ని గురించి ఊళ్లోవాళ్ళు ఆగుబ్బుగా చెప్పకుంటున్నారు. తన ప్రవర్తన లోని లోపాన్ని తన ఎదుటే ఇద్దరు ముగ్గురు స్నేహితులు వ్యాంగ్యార్థంలో తనముఖాన విసరటాన్ని తను గ్రహించాడు. తను ఏదో పరిష్కారమార్గం ఆలోచించాలి. ముందు ఈ అవినీతి శాపంనుంచి తప్పుకో గలిగితే కాని తను మానవుడు కాజాలడు....

ఇట్లా కోటయ్య ఎంతసేపు ఆలోచించాడో తెలీదు. పన్నెండు గంటల ప్రాంతంలో జగ్గయ్యగారు కొంపలోంచి బయటికి వెళుతూండటం గమనించాడు. కుక్కి మంచంలో

అట్లానే దుప్పటి తన్నిపెట్టుకు పడుకున్నాడు. సూరమ్మ బడలిక చేత ఆవులిస్తూ తడికె గొళ్ళెం పెట్టి లోపలకు వెళ్ళింది.

కోటయ్య ఆలోచనలో పడ్డాడు....

ఒక వ్యక్తికి పెద్దమనిషి తనాన్ని అంటగట్టేటప్పుడు సమాజం ఆ వ్యక్తి తాలూకు చీకటి జీవితాన్ని ఎందుకు లెక్కలోకి తీసుకోనదో తనకి అర్థం కాదు జగ్గయ్యగార్ని సమాజం పెద్దమనిషిగా, ధర్మపరుడిగా, ఆదర్శ జీవిగా, మధ్యవర్తిగా నిర్ణయించింది ఆయన చాలా విషయాల్లో పెద్దమనిషిగా నటించాడు, చాల మందికి ధన, ధాన్య, వస్త్రాదికములను సహాయం చేసి ధర్మపరుడిగా పేరు గడించాడు; తను ఒక ఆదర్శంకోసం జీవిస్తున్నానని చాలామందికి తెలిసేట్టు చెప్పి, ఆదర్శ జీవిగా చెలామణి అవుతున్నాడు. చాల వ్యవహారాల్లో మధ్యవర్తిగా వుండి పరిష్కారాలు జరిపాడు——కాని ఆయనగారు రాత్రుళ్లు వూరు మాటుమణిగాక, ఇట్లా కొంపల వెంట తిరుగుతూన్న సంగతిని ఎవరైనా గుర్తించారా? గుర్తించినవాళ్ళు మెదలకండా నోళ్ళునొక్కుకొని వూరుకోవాల్సిందే గాని బయటకు అంటే సమాజం నమ్ముతుందా? సమాజం విశ్వసించని చాలా విషయాల్లో ఎంతెంత దారుణాలు, ఘోరాలు యిమిడి ఉన్నాయి...!

బయట తడికె తలుపు కదిలింది.

కోటయ్య అటువేపు చూశాడు. గాలికి కాబోలు ననుకున్నాడు. కాని మళ్లీ గట్టిగా కదులాడింది.

ఎవడ్రా... అన్నాడు కోటయ్య విసుగ్గా.

సమాధానం రాలేదు. కోటయ్య కుక్కి మంచం లోంచి లేచి తడికె తలుపు తీశాడు. బయట చూరుక్రింద కోమటి సీ భద్రయ్య సుపుత్ర రత్నం పానకాలు నిలబడ్డాడు. కోటయ్యను చూడటంతో పానకాలు గుండెల్లో జనతా ఎక్స్‌ప్రెస్ వేగంగా పరుగెత్త నారంభించింది. కాళ్ళు తేలిపోసాగాయి. పెదాలూ బుగ్గలూ వొణుకుతున్నాయి.

'ఎవడ్రా? ఎందుకొచ్చావురా? ఇక్కడ నీ...' బూతు మాట విసిరాడు కోటయ్య చూరులో వున్న కర్రలాగుతూ కోపంతో.

పానకాలు ప్రాణాలు కడబట్టాయి. పరుగెత్తుదామంటే కాళ్లు రావటంలేదు. ఇంతలో దేవతల్లే లోపల్నుంచి సూరమ్మ వొచ్చింది. కోటయ్య లాఠీ ఎత్తాడు. సూరమ్మ ఆ లాఠీ తీసుకొని అవతల పారలేసింది. గోదావరి పొంగులాగా వొచ్చిన కోపాన్ని కోటయ్య ఎట్లా దిగమింగు కున్నాడో చెప్పలేం! పళ్లు పటపట కొరికాడు. నాసికా రంధ్రాల్ని పైకి ఎగురవేశాడు. అరిచేతుల్ని నులుముకొన్నాడు, నేలను తన్నాడు; తనలో తాను తిట్టుకున్నాడు; పైకి గొణిగాడు. చివరికి అతను చూస్తూవుండగానే కోమటి సీరభద్రయ్య సుపుత్రరత్నాన్ని సూరమ్మ ఆప్యాయంగా చేయి పట్టుకొని లోపలకు తీసికెళ్ళింది. కోడిగుడ్డు లాంతరు వెలుగులోకి పానకాలు బిక్కు బిక్కుమనే గుండెలతోనే నాలుగు అయిదు రూపాయల నోట్లు (నెలరోజులుగా కొట్టుమీద చాటుగా వెనకవేసి కూడబెట్టిన బాపతు) గల ప్రక్కజేబును గట్టిగా

పట్టుకొని సూరమ్మవెంట నడిచివెళ్ళాడు పసిపిల్లవాడి తమ్ముడిలాగా.

'ఛీ తనకొంప వున్నకొంపదికి కుక్కల దొడ్డిలాగా తయారవుతోంది.' అనుకున్నాడు కోటయ్య.

ఆరాత్రి కోటయ్య ఆ కొంపలోకి అడుగుపెట్టలేదు. అతని మనస్సు ఒప్పుకోలేదు. దరిదాపుల్లో వున్న దేవాలయపు మంటపం మీద తెల్లవార్లూ ఆలోచనతోనే గడిపాడు.

* * * *

ఆరోజునుంచీ కిల్లీకొట్టు కోటయ్యలో చాలా మార్పు వచ్చింది. భార్యతో విరివిగా మాట్లాడడం మానివేశాడు. ఆమె చేసే ప్రతిపనిని పూర్తిగా ద్వేషించ నారంభించాడు.

కిళ్ళీ దుకాణం మూసివేశాడు. రావాల్సిన బాకీల కోసం తిరుగ నారంభించాడు.

కిళ్ళీకొట్టు కోటయ్య భార్య విషయంలో ఒక నిర్ణయానికి వొచ్చాడు. భార్యయొక్క అవినీతిని అరికట్టేందుకు ఒక పథకాన్ని వేశాడు. ఆ పథకాన్ని భార్య ఆమోదించి తను చెప్పినట్టు చేస్తుందనే నమ్మకంతోనే ఉన్నాడు కోటయ్య. తనమాట వినని పక్షంలో తనకీ ఆమెకూ గల సంబంధం తెగిపోగల పరిస్థితులు సంభవించ గలవనికూడ తలంచాడు. అట్లాంటి పరిస్థితుల్లో ఆమెతో కాపురం చేయడం, ఆమె వలుముకొనే బురదను నిత్యమూ చూస్తూ సహించడం—ఇకి ముందు తనవల్ల కాదనే నిర్ణయానికి గట్టిగా రావడంతో,

అతనిలో పూర్వంలేని అభిమానమూ, పట్టుదలా, జీవితాన్ని చెడుదారి నుంచి మళ్ళించాలనే అభిలాషా బలమైన ఒక రూపాన్ని దాల్చాయి.

ఆ ఊరినుంచి మకాం మారిస్తే భార్య అవినీతిని అరికట్ట గలుగుతాననే అభిప్రాయం అతనిలో పనిచేసింది. ఒక నిర్ణయానికి వొచ్చాడు. సాధ్యమైనంత త్వరలో ఆ ఊరినుంచి కాపురం ఎత్తివేయా లనుకున్నాడు. అది పెద్ద కష్టమైన పని కూడా కాదు. అతనికి స్థిరాస్థి అంటూ ఏమీ లేదు. ఆ కిళ్ళీ కొట్టూ, నివసించే తాటాకుల కొంపా. కిళ్ళీ కొట్టును అమ్మి వేయవచ్చు తాటాకులకొంప తాలూకు స్థలంకూడా నెమ్మది మీద అమ్మివేయవచ్చు.

నందిగామ అడవుల్లో కోటయ్య అన్న కాంతయ్య ఉన్నాడు. ఆయన అక్కడ రంపపు కోత కోసే వాళ్ళకు మేస్త్రీ. కోటయ్య అన్నయ్యకు ఒక లేఖ వ్రాశాడు: 'ఇక్కడ నాపరిస్థితి బాగుండలేదు కొట్టుమీద జీవనం వెళ్ళమారటం లేదు. అదీగాక ఇక్కడ వుండడంవల్ల ఇంకా చాలా అనర్థాలు చుట్టుకొనేట్టు ఉన్నాయి. ఇక్కడ కాపురం మార్చి నీ దగ్గరకు వస్తాను అక్కడ కలప అడితీల్లో ఏదో ఒకపని దొరక్కపోదు. ఏమీ దొరక్కపోతే నేనూ కూలివాడిగా చేరి రంపపు కోత కోస్తాను. త్వరలో ఉత్తరం వ్రాయ వలసింది. నీ ఉత్తరంకోసం ఎదురు చూస్తూ వుంటాను.'

నాలుగోరోజే కాంతయ్య దగ్గర్నుంచి కోటయ్యకు జవాబు వచ్చింది. 'సంతోషం. నువ్వు ఇక్కడకు రావాలనే

నేనూ కోరుకుంటున్నాను. పని చేయగల సత్తువున్న వాడికి ఇక్కడ చాలా పనులు వున్నాయి. నువ్వు నీ కాపురంతో సహా ఇక్కడకు రా. మాకు తోడుగా వుందువుగాని' ఆ ఉత్తరం చూసుకున్న కోటయ్యకు ఒక సమస్య సులభంగా పరిష్కార మైనట్టు సంతోషించాడు

కోటయ్య కిల్లీకొట్టు బేరం పెట్టాడు. ఆ విషయం సూరమ్మకు తెలియడానికి ఎక్కువ సేపు పట్టలేదు. ఈమధ్య మొగుడియొక్క వాలకం ఆమెకు అర్థం కావడంలేదు ఏదో తప్పు చేస్తూన్నట్టు తప్పుకు తప్పుకు తిరుగుతూన్నట్టు ఆమె గ్రహించింది.ఆ రోజు ఉదయం కోటయ్య కంచంలో కూడు పెట్టి – మనస్సులోని మర్మమేమిటో తెలుసుకోవా లనుకుంది. తనతో మాట మాత్రం చెప్పకుండా తన సంపాదన మీద బ్రతికే మొగుడు, కిల్లీకొట్టు అమ్మజూపటం ఆమెలో రోషం తల ఎత్తటానికి కారణమైంది.

'కిల్లీకొట్టు బేరం పెట్టావుటగా?' అన్నది సూరమ్మ ఎవరి అనుమతితో బేరం పెటావనే భావం ధ్వనించేట్టు.

'ఊఁ!' అన్నాడు గోంగూర పచ్చడి కలుపుకొంటూ.

'ఏం? ఏం వొచ్చింది?' అన్నది సూరమ్మ యీసడింపుగా.

గోంగూర ముద్దనములుతూ మాటాడలేదు కోటయ్య. తను చేస్తూన్న పనికి ఇలా ఎప్పుడో ఒకప్పుడు పెళ్లానికిసంజాయిషీ చెప్పుకోవాల్సిన ఖర్మ పడుతుందని అతను అనుకోక

పోలేదు. గాని ఆ సంజాయిషీ ఎలా చెప్పుకోవాలో ఆలో చించలేదు.

'ఇంకా యేదన్నా వ్యాపారం చేయాలనా?'

'ఉహూం' మళ్ళీ గోంగూర ముద్దను నోట్లో కుక్కు కున్నాడు కోటయ్య. పెళ్ళాం ఎలా విరుచుకు మీద పడు తుందోనన్న భయం అతనిలో లేకపోలేదు.

'మరెందుకూ కొట్టు అమ్మడం?' ఇత్తడితపేళా రోటి కేసి కొట్టినట్టు ఖంగుమన్నది సూరమ్మ కంఠం.

కోటయ్య మాటాడలేదు. మెతుకులు నములుతూ న్నట్టు దవడలు ఆడించాడు.

'నిన్నే-'

కోటయ్య ధైర్యాన్ని నిలవ దొక్కుకున్నాడు.

'ఈ ఊరి నుంచి మకాం ఎత్తివేయాలి'

'యేం?' మొగుడికి పిచ్చి యెత్తిందనే అనుకుంది సూరమ్మ.

'ఇక ఊళ్లో మరి కొన్నాళ్ళపాటు ఉంటే – మనం దమ్మిడీ ఎత్తున కూడా తూగం.'

భర్త మాటలు సూరమ్మకు అర్థంకాలేదు.

"నీ వేషాలు, నీ చేష్టలు, నీ పోకిళ్ళూ యిన్నాళ్లూ సహించాను. కాని ఇకముందు సహించలేను. మానవజన్మ ఎత్తి మానవులుగా బ్రతుకుతూ – 'డబ్బు' కోసం మాన వత్వాన్ని సమాజాన్ని, నీతిని, అభిమానాన్ని విడిచిపెట్టలేను. ఇన్నాళ్లూ ఏదో అజ్ఞానంతో, పిచ్చిభ్రమలతో, పొరలుక్రమ్మిన కళ్ళతో, మదంపట్టిన

వాంటిలో యవ్వనం ఆశించిన ఆటలన్నీ ఆడాను. నీతి, లోకమూ, సాంఘిక విలువా - ఎన్నడూ నా బుర్రలోకి రాలేదు. కాని యికముందు మంచి నీతిగా బ్రతకదల్చు కున్నాను. ఈ డబ్బూ, శరీరపు మెరుగులూ శాశ్వతంకావు. 'ఫలానావాడి బ్రతుకు ఎటువంటిది?' ఈ బ్రతుకుల్లోని మంచిచెడ్డలే జీవితాల విలువలకు తార్కాణాలు.

"ఈ ఊళ్ళోవుంటే, ఈ అవినీతినుంచి తప్పుకునేం దుకు అవకాశం ఉండదు నీతి నిజాయితీగా బ్రతకదల్చు కుంటే, ఇప్పటికైనా మించిపోయిందిలేదు. ఇంకా బోలెడు జీవితం ఉంది-నా వెంట రా! నందిగామలో మా అన్నయ్య వున్నాడు. నేను పనిచేస్తాను నీకు జీవనానికి లోటులేకుండా చేసే బాధ్యత నాది. ఏమంటావు?" కంచంముందునుంచి లేచాడు కోటయ్య.

భర్త ఉపన్యాసం వింటూ దిగాలుపడి నిలబడి పోయింది సూరమ్మ. ఆమెకు అంతుబట్టని చాలా మాటలు దొర్లించాడు మొగుడు. కాని ఆమె తీరా ఆలోచించు కున్నాక మొగుడి అభిప్రాయం సుతరామూ నచ్చలేదు.

"నువ్వు నందిగామ వెళ్ళు — నాగలోకం వెళ్ళు. నేను ఈ ఊరిని వొదిలిపెట్టను నువ్వు నన్ను పోషిస్తావని నాకు ఏనాడూ నమ్మకంలేదు. నా సంపాదనమీద బ్రతికే వాడివి, నువ్వు నన్నెక్కడ పోషిస్తావు? నీతేమిటి? అవినీతే మిటి? లోకమేమిటి? ఎవరి యిష్టం వాళ్ళది. నా ఇష్టంవచ్చి నట్టు నేను బతుకుతాను నన్నూ, నా బ్రతుకునూ కాదనే వాళ్ళెవ్వరు? ఒకళ్ళకు దడిచేదేమిటి? నాకు యిక్కణ్ణే

బాగుంది. నేను ఎక్కడికీ రాను" కుండ బ్రద్దలుకొట్టేసింది సూరమ్మ.

కోటయ్య తొణకలేదు. పెళ్ళాం యెంతగా తెగించి మాట్లాడుతూందో అర్థంచేసుకొని మండిపోయాడు. కాని పైకి శాంతంగానే మాట్లాడాడు.

"నువ్వు ఏదో ఇప్పుడు రోజులు చక్కగా గడుస్తున్నాయిగదా అనుకుంటున్నావు. ఇట్లా బ్రతుకును వెళ్ళ మార్చినవాళ్ళు చివరకు ఎల్లాంటి కష్టాలు అనుభవించారో నీకు తెలిదు. చివరకు వాళ్ళబ్రతుకు కుక్కలకంటె హీన మైన పరిస్థితులు కూడా ఉన్నాయి. నా మాట విను. నా వెంట రా. నీ భుక్తికి నేను హామీ ఇస్తున్నాను. ఈ కుళ్ళు నుంచి సాధ్యమైనంత త్వరలో బయటపడదాం" అన్నాడు కోటయ్య ఆవేశంగా.

మొగుడిమాటలకు నవ్వింది సూరమ్మ.

"నా భుక్తికి నువ్వేమీ హామీ యివ్వక్కర్లేదు. నేనంత అసమర్థురాల్ని కాదు. నేను మాత్రం ఈ ఊరినుంచి రాను."

"అయితే యిక్కడే వుండు. నేను మాత్రం ఈ ఊళ్లో వుండను. నీకు మొగుడుగా యింకా ఈ ఊళ్లో ఒక్క రోజు వుండలేను" అన్నాడు కోటయ్య నిశ్చయంగా

ఆ చివరి వాక్యానికి సూరమ్మ మండిపోయింది.

"వెళ్ళు. నీ ఇష్టంవొచ్చినచోటుకు పో. నేనంటే, నా బ్రతుకంటే అంత నామోషీగా వున్నవాడివి – నన్ను

ఇట్లా ఎందుకు తయారుచేశావ్?" అన్నది సూరమ్మ. ఆ కంఠంలో కోపమూ, ద్వేషమూ, ఆవేశమూ ఉన్నాయి. కానీ జాలీ పశ్చాత్తాపమూ, విచారమూ లేవు.

"అక్కడే నాబుద్ధి గడ్డితిన్నది. నేను మానవత్వాన్ని పోగొట్టుకున్నది. నువ్వు బురదలోకి దిగితే ఏమనలేదు. నువ్వు బురదలో పొర్లాడుతూంటే చూస్తూ వూరుకున్నాను. ఆ తప్పంతా నాదే! ఇప్పుడు అంటున్నాను - ఆ బురద లోంచి బయటకు రమ్మని. కాని నీకు ఆ బురదలోనే బ్రతకా లని ఉంది. నీకు ఆ బురదలోవే స్వర్గం అగపడుతూంది. కాని అది బురదే! కొన్నాళ్ళకు ఆ బురద తాలూకు నిజ స్వరూపం నీ అనుభవానికే వొస్తుంది. ఆ బురదవల్ల జీవితం ఎట్లా నాశనమైందో నువ్వే తెలుసుకో గలుగుతావు. కాని ఒక విషయం చెబుతున్నాను. అప్పుడు నువ్వు ఇన్నాళ్ళూ బురదలో కొట్టుకులాడినందుకు యెంతగా పశ్చాత్తాప పడ్డా- ఆ బురదలో కొట్టుకులాడిన ఫలితాన్ని అనుభవించకుండా పోవు. సమాజం నీకు తగిన శిక్ష విధించకుండా ఉండదు."

"అబ్బో! మహా చెప్పొచ్చావులే... బురదటబురద... అంతా మహా పన్నీరులో బ్రతుకుతున్నారు గామోసు" అన్నది సూరమ్మ యెకసక్కెంగా.

కోటయ్య మాట్లాడలేదు. బజారు కెళ్ళాడు.

ఆ మరునాడే కోటయ్య కిళ్ళీకొట్టును కూరగాయల బేరగాడు బాపనయ్యకు అమ్మాడు.

కిళ్లీకొట్టుమీది ఖాతాలు చాలా భాగం వసూలు చేసుకున్నాడు కోటయ్య. మిగతా ఖాతాలను 'పెదరా

ఫ్యూరు ఖాతాల క్రింద జమ కట్టుకున్నాడు. ఆ రాత్రే భార్యతో అన్నాడు.

"రేపు తెల్లవారు ఝామున నేను రైలెక్కుతున్నాను..."

"ఊఁ!" అన్నది సూరమ్మ చీమకుట్టినంత బాధైనా కనబర్చకుండా. కోటయ్య విశేషించి ఏం మాట్లాడలేదు. గుడ్డలన్నింటినీ ఒక పెట్టెలో పెట్టుకున్నాడు. తనకి కావల్సిన సామాన్లన్నింటిని ఒక మూటకట్టాడు. ఒక సంచీలోకి మరికొన్ని వస్తువుల్ని సర్దాడు. కిల్లీకొట్టు అమ్మగా వొచ్చిన నూటపాతిక రూపాయల్ని మనీపర్సులో భద్రపరిచాడు. ఇంకా ఇంట్లో పెట్టెలో వందరూపాయలవరకూ ఉన్నాయి. ఆ పైకాన్ని తీసుకోడానికి మనస్సు పుట్టలేదు. భార్యకు వదలివేశాడు. పెట్టె, మూట, సంచి-ఒక ప్రక్కన పెట్టి రాత్రి తొమ్మిదిన్నర గంటలకు నుక్కమంచం ఎక్కాడు కోటయ్య నిశ్చింతగా.

మొగుడు సామాను సర్దుతూండడాని సూరమ్మ చూసింది. సర్దుతూన్నంత కాలమూ చూస్తూనేవుంది. కోటయ్య ఒక్క మాటకూడా మాట్లాడలేదు. మొగుడి పట్టుదల సూరమ్మకు ఆశ్చర్యాన్ని గొల్పింది. ఆ ఆశ్చర్యంలోనే ఆమెకు జాలికూడా కలిగింది...

మొగుడు ప్రయాణం కడుతున్నాడు. ఎందుకు?... తన అవినీతినీ, అప్రదిష్టనీ సహించలేక! ఇన్నాళ్లూ సహించలేదా! తను వెళ్ళమన్నది, ఏ మాత్రం అభ్యంతరం చెప్పలేదు. తనని రమ్మన్నాడు. రానన్నది. స్వతంత్రంగా బ్రతక

గలనన్నది. తను స్వతంత్రంగా ఎట్లా బ్రతకగలుగుతుంది? ఏం...జగ్గయ్యగారు, కోమటి అబ్బాయి, పంతులు, తాపీ మేస్త్రీ అమ్మయ్య - వీళ్లు తనని బ్రతికించలేరా? వాళ్ళు తనిని బ్రతికించాల్సిన అగత్యం పట్టడమేమిటి? అది ఏం ధర్మం? ఏం నీతి? తను యిన్నాళ్ళుగా బ్రతికిన బ్రతుకు మటుకు - ధర్మంతోనూ, నీతితోనూ కూడుకున్నదేనా? కాని భర్త ఉన్నాడు. ఇకముందు భర్త ఉండడు. తను 'వ్యభిచారిణి' గానే బ్రతకాలి. ఏ దుస్థితి వొచ్చినా ఆదుకొనేందుకు హామీ యెవరూ ఉండరు, జగ్గయ్యగారు, కోమటి అబ్బాయి, పంతులు, తాపీమేస్త్రీ అమ్మయ్య - వీళ్ళు తన శరీరపు మెరుగులు మాయనంతవరకూ తన చుట్టూ తిరుగుతారు. ఆ పైన తన గతి? తను ఎట్లా బ్రతకాలి? ఏదైనా రోగంవొస్తే-ఈ జగ్గయ్యగారు, కోమటి అబ్బాయి - తన సంగతి ఆలోచిస్తారా? ఏమో! తన యింటికివొచ్చేవాళ్ళు ఎవ్వరూ సంఘాన్ని లెక్క-చేయనివాళ్లు కారు. వాళ్ళకి పరువూ, మర్యాదా, సంసారమూ, పిల్లలూ, సాంఘిక విలువలూ - అన్నీ వున్నాయి. పట్టపగలు తన యింటికి ఎవ్వరూ రారు. బహిరంగంగా అవినీతిని ద్వేషిస్తూ-అంతరంగికంగా అవినీతి దుప్పటిని కప్పుకొనేవాళ్ళే వీళ్ళంతా. వీళ్ళను నమ్ముకొని తను భర్తను వొదులుకుంటే - తన బ్రతుకు బండలు కాదూ!

తనకి మగవాడు అనేవాడు ఒకడు అండగా లేకపోతే తను ఏం బ్రతకగలుగుతుంది? సంఘం తనను ఎంతైనా హీనంగా చూస్తుంది. మొగుడ్ని వొదిలిపెట్టిన రత్తిగతీ,

నాంచారమ్మగతీ ఎట్లా అయింది! చివరకు వాళ్ళ బ్రతుకులు పురుగుల పాల పడలేదూ; తన బ్రతుకూ అంతే! డబ్బుతో సుఖాన్ని కొనుక్కొనేందుకు ఉబలాటపడే ఈ మనుష్యులా తనకు ముఖ్యం? అగ్నిసాక్షిగా పెళ్ళాడిన మొగుణ్ణి, కష్టాల్లో సుఖాల్లో సగభాగం పంచుకొనే మొగుణ్ణి వొదలి, తను ఒక్కత్తే అడ్డమైన ప్రతి వెధవకూ దసుస్తూ, లోకం చేత 'ఛీ' అనిపించుకుంటూ, మురికి బ్రతుకును గడపడం ఏంసబబు? ఛీ, ఛీ, తను ఇన్నాళ్లూ యింత గుడ్డిగా అవినీతిగా జీవితాన్ని గడిపిందేం? ఆయన అన్నట్లు నిజంగా తనది బురదగుంటలోని బ్రతుకే! కేవలం అవినీతివల్ల డబ్బును గడించటం ఎంతైనా అప్రదిష్ట! జీవించటానికి ఇంకా మార్గాలు లేవా! ఆ బుచ్చెమ్మలాగ తను రోజూ పొలం కూలికి ఎందుకు పోకూడదు? అది నలుగురు పిల్లల్ని పోషిస్తుందే!... తనూ, యీ బురదనుంచి బయటపడాలి... తనూ, భర్తా శరీరకష్టం చేసి ఎందుకు హాయిగా బ్రతకలేరు?

బయట చప్పుడు. తడికె తలుపు తెరుచుకుంది. కోటయ్య నిశ్చింతగా నిద్రపోతున్నాడు. జగ్గయ్యగారు తల మీదవున్న పది వెంట్రుకల పాపిటనూ సరిచేసుకుంటూ లోపలకు వచ్చాడు. ఈవెనింగ్ పారిస్ సెంట్‌తో ఇల్లు 'గుప్' మన్నది. సూరమ్మ లేచి నిలబడింది.

"...సూరీ!" అంటూ జగ్గయ్యగారు సూరమ్మను దగ్గరకు లాక్కుని నడుంచుట్టూ చేతులువేసి, మంచందగ్గరకు తీసికెళ్ళాడు.

కోడిగుడ్డులాంపు వెలుగులో సూరమ్మ సాధ్యమైనంత వరకూ ముఖంలో మార్పును అగపడనీయకుండా, జగ్గయ్య గారు తన శరీరంలో మెత్తటిభాగాలు దగ్గరచేసే చేష్టలకు ఉద్రిక్తురాలైనట్టు నటిస్తూంది.

"కోటయ్య రేపు నందిగామ వెళతాడటగా! నిన్ను కూడా తీసికెళుతున్నాడా?" అన్నాడు జగ్గయ్యగారు.

"ఉహుఁ! నేను రానన్నాను."

"భేష్! అలా వుండాలి" సంతోషంకొద్ది ఖారా కిల్లీలవల్ల నల్లగా గారపట్టిన పళ్ళు బయటపడేట్టు నవ్వాడు జగ్గయ్యగారు.

"నువ్వు యిక్కడే వుండు. నువ్వు ఆ అడవుల్లో కూలి పని చేయలేవు అంత ఖర్మ నీకేంపట్టింది – నేను ఉండగా. నీకేలోటూ వుండదు. నీకు తగిన తిండిపెడతాను. గుడ్డలు యిస్తాను. వాయిల్స్, సిల్కు, పట్టూ—ఒకటేమిటి కోరుకున్న చీరెలు, జాకెట్‌లు, నగలు చేయిస్తాను. అడిగినప్పుడల్లా ఖర్చులకు డబ్బులు యిస్తూవుంటాను—ఇంతెందుకూ నీకు అందచేతిలో స్వర్గమే చూపిస్తాను. ఏం? ఇదిగో—ఇప్పటికి ఈ వందరూపాయలు తీసుకో!" జగ్గయ్యగారు ప్రక్క జేబులోంచి వందరూపాయల నోటు తీసి ఆమె వొళ్లో విసిరారు. ఆ సంవత్సరం పసుపుతోటలమీద కొన్ని వేల రూపాయలు ఆదాయం వొచ్చింది. అట్లా ఎన్ని పచ్చకాగితాల్ని విసిరివేసినా ఆయనగారికేం లెక్క ఉండదు.

ఆ రాత్రి మామూలుగానే సూరమ్మ జగ్గయ్యగారి అనుభవానికి మెరుగులు దిద్దింది.

యథాప్రకారంగానే జగ్గయ్యగారు పన్నెండుగంటలు కాగానే సూరమ్మ దగ్గరనుంచి ఇంటికి వెళ్ళిపోయారు.

*　　*　　*　　*

తెల్లవారింది—

పొద్దుపొడిచింది—ఎండ వొచ్చింది.

కోటయ్య ఇంటికి లావుపాటి తాళంపెట్టి వుండటం ఈవీథిలో చాలమందికి ఆశ్చర్యాన్ని కలిగించింది. 'ఎక్కడకు వెళ్ళారు?' అంటే 'ఎక్కడకు వెళ్ళారు?' సమాధానాల్ని తలా ఒక విధంగా చెప్పతున్నారు, తెలిసినవాళ్ళు కోటయ్య పెళ్ళాంతోసహా నందిగామ తెల్లవారుఝామున రైలుకు వెళ్ళాడని అనుకున్నారు. 8 గంటలకు జగ్గయ్యగారు కాలువకట్టకు వెళుతూ—కోటయ్య ఇంటికేసి చూశాడు. ఆయనగారి గుండెలు ఒక్కసారి దిగజారినయ్. నిర్విణ్ణుడై రెండు నిముషాలపాటు తడికెను వేసిఉన్న ఆ లావుపాటి తాళంకేసే చూశారు.

"తప్పించుకు పోయిందిరా పిట్ట!" అనుకున్నాడు జగ్గయ్యగారు ఏమీ చేయలేని స్థితిలో.



# పగిలిన అద్దం

కాలేజీ గోడలమధ్య' చెరనుంచి బయటపడి, సాయంత్రపు బజారు సందడిని తప్పించుకొని మేడ ముందుకొచ్చాడు—ప్రొఫెసర్ రంగనాథం.

. మూడంతస్థుల మేడ మెట్లెక్కాడు. మూడో అంతస్థులో ఉన్న తన గది ముందు నిముషంసేపు నిలబడ్డాడు. నెమ్మదిగా నిట్టూర్పు విడిచి - నింపాదిగా గాలి పీల్చుకున్నాడు

ట్రవుజర్‌లోంచి తాళపుచెవి తీసి - తాళంలోకి దూర్చాడు. తలుపుమీద గ్లాస్‌ప్లేట్‌లో చెక్కబడి అమర్చబడ్డ తన పేరును, డిగ్రీలతో, డిజిగ్నేషన్‌లతో సహా చూసుకున్నాడు-

చిన్నగా చిరునవ్వు నవ్వుకున్నాడు. ఎందుకో ?

ఎన్నడూ తన పేరును చూసికొని అట్లా నవ్వుకున్న పాపాన పోలేదు

ముని మాపువేళలో ఆ మేడ - కొండమీద నుంచు పడుతూన్నట్టుగా నిశ్శబ్దంగా ఉంటుంది. మేడ మూడో అంతస్థులో ఎవ్వరూ ఉండరు - ఆయన తప్ప.

గదిలో లైటువేసి – కుర్చీలో కూలబడ్డాడు. ఆయన అలసి వున్నాడు. అంతగా అలసిపోవడానికి కారణమేమీ లేదు.

ఆ రోజు ఒక క్లాసుకంటె ఎక్కువ తీసికోలేదు. క్లబ్‌కు వెళ్ళలేదు. ఎవ్వరితోనూ ఏ విషయం మీదనూ వాదించలేదు కాని, ఆయన అలసిఉన్నాడు. కారణం— ఏమీ లేదు.

ఏదో కారణంలేని బడలిక శరీరాన్ని ఆ స్థితిలో పెట్టింది. నిద్ర ముంచుకు వచ్చేంతగా హృదయం అలసి పోయింది.

"బహుశా తను ముసలివాడు అవుతున్నాడేమో !" అనుకున్నాడు ప్రొఫెసర్ రంగనాథం ఏదో నేరం చేసి నట్టు.

అవును. ఆ క్షణంలో ఆయన ఆకారాన్ని చూసిన ఏ వివేకవంతుడూ – ఆయన ముసలివాడని నిష్కర్షగా చెప్ప టానికి జంకడు.

నిజంగా ముసలివాడు కావటం లేదూ ! కావట మేమిటి? అయితే! ఆయన ముసలివాడే! వయస్సును సుల భంగా నిర్ణయించే నెరసిన జుత్తూ, ముడతలుపడ్డ శరీరమూ, లోతుకుపోయిన కళ్లూ, ముందు పళ్ళులేని నోరూ – నూసిన కంబళి మంచంలో నీలుక్కుపోయినట్టుగా కుర్చీలో కూలబడ్డ ఆయన ముసలివాడు కాదూ? నిజంగా ఆయన వయస్సు ఏభై రెండు సంవత్సరాలు. కాని అరవై నాలుగేళ్లు సింకిన

ముసలివానిలాగా అగపడతాడు. అందులో పొరపాటూ లేదు. ఆశ్చర్యం అంతకంటే లేదు.

"...తను ముసలివాడు అవుతున్నాడా? అంతే నేమో... అందుచేతనే ఇంత బడలికా, ఆయాసమూ, ఏమీ తోచకుండా వుండటం—'ఫీల్' అవుతున్నాడేమో!" అనుకున్నాడు మళ్ళీ.

ఆలోచనలు అప్రయత్నంగా గత జీవిత చరిత్ర మీదకు దూకాయి.

తన జీవిత గతి ఏమిటి?

తనకు జీవితంలో ఎదురైంది ఏమిటి—జయమా? అపజయమా?... అపజయం_

తన జీవితం అట్లా ఎందుకైంది?

ఏ వ్యక్తులు, ఏ శక్తులు, ఏ పరిస్థితులు_ తన జీవితం ఇట్లా పరిణమించటానికి తోడ్పడ్డాయి?

జీవితంలో తను సాధించిం దేమిటి?

... ... ...

ఏం లేదు?

అవునా?

శూన్యం. అంతా మిథ్య.

—సరస్సులోని నీళ్ళమీద పున్నమినాడు పడే వెన్నెల శోభా, నెలవంక చిరునవ్వుకు నక్షత్రాలు చేసే నృత్యలాస్యమూ, యౌవనంలో ఉన్న యువతి ఒళ్ళు విరుపులోని మోహమూ, గులాబీ పూరేకుల పేశలత్వమూ, పసిపిల్లల నవ్వులోని సొగసూ, నీలాకాశాన పరుగెత్తే తెల్ల

మబ్బుల సోయగమూ, పర్వతాల మధ్య పడే జలపాతపు సౌందర్యమూ...అంతా మోసం! అన్నీ మనస్సుమీద మసిగుడ్డను కప్పేవే! ఒక వ్యక్తి మరొక వ్యక్తిని నమ్మటానికి వీల్లేదు.

ఒక హృదయం మరొక హృదయాన్ని ఆక్రమించుకోవటానికి వీల్లేదు. ఒక మనస్సు మరొక మనస్సును కాగలించుకోవటానికి అవకాశం లేదు.

వ్యక్తుల హృదయాల్లోకి చూడటానికి అలవాటుపడని మనుషులతో నిండిన యీ లోకంలో – ఏది నిజమో, ఏది మోసమో, ఎవరి హృదయం నిర్మలమో, ఎవరి హృదయం మలినమో, ఎవరు మిత్రులో ఎవరు శత్రువులో – ముఖ్యంగా స్త్రీల విషయంలో కష్టం!

...అప్పుడే తనకు ఇలాంటి వృద్ధాప్యం సంక్రమించటానికి కారణమూ – తను బడలికతో, వివరింపరాని విచారంతో, అంతుపట్టలేని నిరాశతో, భవిష్యత్తు లేదన్న బెంగతో, జీవితంలో సౌఖ్యానికి లంగరందలేదన్న బాధతో, నిత్యమూ మనస్తాపంతో కుస్తీపట్టడానికి హేతువూ – గత జీవిత చరిత్రల్లోని ఘట్టాలే!

డ్రాయరుమీద రెండు గజాల దూరంగా ఏదో సిగరెట్టు టిన్ ఉన్నది. అవి త్రాగితే ఏదో కొంత ఉత్సాహం, కాలం గడుస్తున్నట్టు వుంటుంది. డ్రస్సు విప్పి, సిగరెట్టు త్రాగుతూ నిద్రపోవచ్చు.

కాని డ్రస్సు విప్పవద్దూ, సిగరెట్టు టిన్ లేచి అందు

కోవడమూ - తలుచుకోగానే ఏదో బాధం ఆవహించింది. కను రెప్పలు క్రిందికి కొన్ని క్షణాలపాటు వాలినై.

... మెదడులో ఆలోచనలు మెదిలినై.

నిజంగా తన జీవితం ఎంత వ్యర్థం? సాధించిందేమీ లేదు. తరుణానికి వచ్చే పైరు బూడిదైనట్టు జీవితంలో స్వర్గ సుఖాల్ని బడసే కాలం వృధా అయింది. గులాబి చెట్టు కొమ్మన పూసిన పువ్వు కొమ్మనే ఎండిపోయినట్టు యౌవనం తాలూకు తన కోర్కెలు తనలోనే ఘనీభవించినై

తను ఇతర్లకు చేసింది ఏమీ లేదు.

తను బాగుపడింది అంతకంటె లేదు.

కాని తను జీవితంలో ఏదో బావుకుందామని, ఆదర్శవంతుడిగా వ్యవహరించాలని... ప్రయత్నించాడు... ప్రయత్నించాడు. ఆక్స్‌ఫర్డును వదలగానే - తను ఎంతో సంతోషించాడు - భారతదేశంలో ఎంతో భవిష్యత్తు వుంటుందని తను ఎంతో గొప్ప "మేధావి" అని లోకం చేత అంగీకరించబడ్డాడు. పేరు ప్రఖ్యాతులకోసం ఆశించాడు. పాటుబడ్డాడు. ప్రపంచంలో తన పేరు చిరస్థాయిగా వుండాలనుకున్నాడు - తన విజ్ఞానాన్ని, శక్తిని, సామర్థ్యాలనూ, చదువునూ ఉపయోగించాడు. ఒక్క నిముషం కూడా వ్యర్థపుచ్చలేదు. ఎన్నో కష్టపు దినాలను, నిద్రలేని రాత్రుళ్ళను ఎంతో వోర్పుతో అనుభవించాడు. కీన్సు, రాబర్డ్సన్, మార్షల్, హాట్రే, హానే, ఏడెమ్‌స్మిత్ మొదలైన వారి ఎకనామిక్స్ పుస్తకాలు తరచి తరచి చదివాడు. ఎన్నోవాద

ప్రతివాదాల్లో పాల్గొన్నాడు. ఎన్నో సార్లు లెక్చర్సు ఇచ్చాడు. పొలిటికల్ ఎకానమీ, మోనటరీ థియరీ, ఎకనామిక్ థాట్, ఫండమెంటల్స్ ఆఫ్ ఎకనామిక్స్ మొదలైన తను వ్రాసిన పుస్తకాలు ఇప్పటికీ కాలేజీల్లో టెక్స్టుబుక్సుగా చెలామణి అవుతూ, ఎన్నో వేలమంది విద్యార్థుల చేత చదువబడుతూ వున్నాయి

కాని ఏం లాభం?

తన జీవితపు విలువ ఏమిటి?

తను జీవితంలో ఏం సాధించు దామనుకొన్నాడు? ఏం సాధించాడు?

...జ్ఞాపకం తెచ్చుకోలేడు? అంతా నిష్ఫలం.

తనకి ఒక వస్తువుమీద మనస్సు ఏర్పడుతుంది — ఆ వస్తువును పొందడం ద్వారా జీవితంలో సంపూర్ణమైన సుఖాన్ని స్థాపించుదామని అనుకుంటాడు. కాని ఆ వస్తువు లభించదు - లభించినట్టే వుంటుంది. కాని అంతా భ్రమ! ఆశలూ, జీవిత కాలమంతా పెంచుకొంటూ వస్తూన్న గాఢ సమ్మకాలూ, కలలూ, మమతలూ - అన్నీ గాలి వానకు రోడ్డుమీద రేణువులు కొట్టుకుపోయినట్లు పోతాయి! తను ఏం పాపం చేసికొన్నాడో? తనలో ఏం లోపం ఉందో? తనెందుకు పనికిరాడో!

శిల్ప ప్రతిమవలె - నిశ్శబ్దంగా, నిశ్చలంగా కూర్చున్నాడు. పూర్వ స్మృతుల ప్రవాహంలో ఆలోచనలు అటూ ఇటూ అశాంతిగా సంచరిస్తున్నాయి.

కుర్చీమీద ఉన్న తన చేతిని మెడ ప్రక్కకు తిప్పి

చూసుకున్నాడు. నేత్రాలను అప్రయత్నంగా కేంద్రీక రించాడు. కొన్ని క్షణాలపాటు సర్వాన్నీ మంచి దాన్ని స్టడీ చేయడంలో నిమగ్నుడైనాడు - కీన్సు "ఎక్స్‌టెర్నల్ ఆన్ మనీ" స్టడీ చేస్తూన్నప్పుడు ముఖం పొందే గాఢమైన నిశ్చలత్వమే అగపడుతుంది.

తన చేయియేనా ? అంత పేలవంగా, సన్నగా, ముడుతుగా - పల్చగా - ఎండిపోయిన ఆకులాగా వున్నదేం? నెత్తురు ముఖం చూడని గోళ్ళు - ఇట్లా ముడతలు పడ్డ వ్రేళ్ళల్లోకి చొచ్చుకుపోయారేం? వాటి గదిలో సలు పెక్కిన ఎలక్ట్రిక్ వైర్సులాగా నరాలు బయటికి పొడుచుకు వచ్చాయేం?... చర్మం అట్లా మాసిన కంబళి గుడ్డలా వ్రేలాడుతోందేం?... ముసలివాడి చేయి ఎట్లా వుంటుంది మరి?... తను ముసలివాడేనా? కాదు మరి...

కళ్లు ముడతగా మూసుకుపోయి ముందుకు తూలే వరకూ ఆ చేయి వంక చూస్తూనే వున్నాడు. కాని ఆయన నిద్రపోవడం లేదు. బలహీనం చేతా, అనవసరంగా అలా ఉండటం చేతా——అట్లా అవుపిస్తున్నాడు—అంతే!

కళ్ళు విప్పాడు - చీమ కుట్టినట్టుగా-

తల యెత్తాడు - ఎవరో తట్టి మేల్కొల్పినట్టుగా.

అటు ఇటూ కదిలాడు - యెవరో పిలుస్తున్నట్టుగా.

శరీరం చల్లబడినట్టుగా తోచింది - వాతావరణం చల్లదనపు పొలిమేరల్లో ప్రవేశించిందేమో! చంద్రుడు

ఉదయించాడేమో! చలి నిర్భరంగానే ఉంది. కాని సుఖం గానే వుంది – లేచి మీద కాశ్మీర్ శాలువా కప్పుకొనే కంటె, ప్రక్కమీద ముసగదీసికొని పడుకొనేకంటె.

లోకం ఎంత ప్రశాంతంగా ఉంది?
అప్పుడే అంతా నిద్రపోతున్నారేం?
తోటలో గులాబి పువ్వు,
గూటిలో రామచిలుకా,
మేడలో పడుచు కన్యా.

వీధిలో బిచ్చగాడూ–అంతా నిద్రపోతున్నట్టున్నారు. తను నిద్రపోవడంలేదు. తనకి నిద్ర రావటంలేదు. తనకి నిద్ర ఎందుకు రావటంలేదో తెలుసు. తను "నిద్ర"ను గురించి మేరీ స్టూప్స్ వ్యాసం చదివాడు. తనలాంటివాళ్ళు అసలు నిద్రపోతారా ?

తన గది ఎంత ఖాళీగా ఉంది? లోకం ప్రశాంతంగా ఉన్నట్లే – తన గది ఖాళీగా ఉంది. తనూ గది ఖాళీగా ఉన్నట్లే – ప్రశాంతంగా ఉన్నాడు. ఈ ప్రపంచానికి ప్రశాంతంగా ఉన్న తనూ, ఖాళీగా ఉన్న తన గదీ – అక్కర్లేదు. మిగతా మానవ ప్రపంచానికీ, తనకీ అగాధమంత భేదం ఉంది. మిగతా మానవ ప్రపంచం అభ్యుదయ పథంలో ముందుకు పోతోంది – తను ముసలివాడు, ముసలివాడు ఎప్పుడూ ముందుకు పోలేడు. తనకి ఎవ్వరూ ఆసరా లేరు?

తనకి ఏదైనా ఆపద జరిగితే—
ఏ క్షణాన్నైనా ఆరోగ్యం చెడితే,

ఎవరిసహాయమైనా కావాల్సివస్తే - తను ఏంచేస్తాడు? ఏం చేయగలడు? బిగ్గరగా కేకలువేస్తే - ఎవరున్నారు? ఎవరు వింటారు? ఉదయం తొమ్మిది గంటలకు కానీ పోర్టరు భార్య టీ తీసికొనిరాదు కాని ఈరోజున తన గతి ఎట్లా వున్నా, ఏ ప్రమాదం వాటిల్లినా, యే మాయదారి రోగం ముంచుకు వచ్చినా, యే శత్రువు మీదకు దుమికినా - కనుక్కొనేవాళ్ళు యెవ్వరూ ఉండరు. మరునాడు ఉదయం తొమ్మిదిగంటలవరకూ, తనది అట్లాంటి ఒంటరి బ్రతుకు!. పగిలిన అద్దం

కాని తను పెళ్ళిచేసుకొని ఉంటే - భార్యా, పిల్లలూ బంధువులూ, హితులూ - ఎంతో బలగం వుండేదికాబోలు! చిన్న యెడారిలాంటి ఈ బ్రతుకులో సౌఖ్యం చూడని బ్రహ్మచారి కొంపకు బదులు స్వంత ఇల్లు ఉండేదికాబోలు!

నిజంగా తను పెళ్ళి చేసికొని ఉంటే—

కాని తను పెళ్ళి చేసికోలేదు.

జీవితంలో పెళ్ళి చేసికోలేని అసమర్థుడైనాడు. ప్రేమించిన స్త్రీని పొందలేని నిర్భాగ్యుడైనాడు.

వ్యక్తి జీవితంలో ఇంతకంటె ఘోరమైన పరాజయం వుంటుందా?

పద్మావతిని పెళ్ళి చేసికొనివుంటే - తన జీవితం ఇట్లా వృధా అయేదా?

కాని అదంతా తన దురదృష్టమే!

ఇరవై సంవత్సరాల వయస్సులో ప్రొఫెసర్ రంగ నాథం ఆమెను మొట్టమొదటిగా కలుసుకున్నాడు. అప్పుడు ఆమెకు పద్దెనిమిది సంవత్సరాలు ఇప్పటికీ ఆమె రూపు కళ్ళముందు కదులాడుతూనే ఉంటుంది.

ఆమె నవ్వుతూంటే - గులాబి పువ్వు రేకులు విచ్చు కున్నట్టూ, మయూరం పచ్చగడ్డిమీద పింఛం విప్పు కొన్నట్టూ, నిశ్చలమైన నీటిలో హంస జరజర నడిచిపో తున్నట్టూ - సొగసు ఆమె ముఖాన్నంతా పర్చుకొనేది.

ఆమె మాట్లాడుతూంటే- వెన్నెల వెలుగును నుంచు కొండమీదనుంచి మంచు జారుతూన్నట్లు ఉంటుంది.

ఆమె నడుస్తూంటే - వేసవి కాలంలో వర్షించని మేఘాల నీడలు పల్చని ఇసుకమీద ఒయ్యారంగా కదు లాడు తున్నట్లుగా వుంటుంది.

ఆమె చూస్తుంటే - చంద్రుడు మబ్బు చాటునుంచి గోముగా తొంగి చూసినట్టుగ, ఉవ్వెత్తుగా లేచిన కెరటం సంధ్యా సమయంలో కన్పించినట్టుగా, లోకంలోని ఆకర్ష ణంతా కళ్ళల్లో నెల్లి విరుస్తున్నట్టుగా వుంటుంది.

తను ఎట్లా మర్చిపోగలడు—?

—మునిమాపున పొడిచిన నెలవంక వయ్యాన్ని స్ఫురణకు దెచ్చే ఆమె కనుబొమల వలయు సౌందర్యమూ—

—విచ్చుకున్న తామర పుష్పంపై సూర్యుని కిరణం పడ్డట్టు మెరిసే ఆమె శరీరం—

—నీటి అలల్లాగా ఒంకులు తిరిగిన నల్లని మెత్తని ఆమె జుత్తు—

—ముచ్చటగా వుందనిపించే ముక్కు—

—ఎట్లా మర్చిపోగలడు ?

పన్నెండు సంవత్సరాలు ఆమెమీదే ఆశ పెట్టుకొన్నాడు. ఆమె ఆరాధ్య దేవత! ఆమెతోనే లోకం, స్వర్గం, కాలం గడపటం, వూపిరి పీల్చుకోవడం! ప్రేమించాడు పెళ్ళి చేసికొందా మనుకున్నాడు. కాని ఆమె ఎప్పుడూ అంటూ ఉండేది.

"ఉహూ! నిన్ను ప్రేమించటం లేదు. కాని నువ్వంటే నా కెంతో అభిమానం, ప్రాణం. స్నేహితునిగా ప్రేమిస్తున్నాను. మా అమ్మ, అక్కయ్య, అన్నయ్య- అంతా అలానే ప్రేమిస్తున్నాం. నిన్ను నేనెలా పెళ్ళి చేసుకోను ?"

కాని, ఆమె ఎవ్వర్నీ - పెళ్ళి చేసికోలేదు.

—ఎవ్వర్నీ ప్రేమించలేదు. తను పన్నెండు సంవత్సరాలూ ఆమె ఇంటికి ఆహ్వానింపబడని అతిథిగానే వెళ్లుతూ వుండేవాడు.

ఆమె చక్కగా మాట్లాడేది. ఉత్సాహంగా ఆడుకొనేది. ఆనందంగా పాటలు పాడేది. ఉషారుగా పరిహసించేది, నిబ్బరంగా నవ్వేది, అంతలోనే జాలిపడేది ... తను ఎట్లా అర్థం చేసికొనేవాడు? ఆడదాని హృదయం అంత అగాధమా? ఆ అగాధాన్ని అన్వేషించలేని అసమర్థుడా? తను నమ్మాడు. మనస్సు విశ్వసించింది. హృదయం ఘోషించింది ... ఆశతోనే జీవిస్తూ వస్తూన్నాడు ...

—తర్వాత ఆమె చనిపోయింది.

ఒకరోజు మధ్యాహ్నం పిలుపు వచ్చింది - ఆమెకు జబ్బుగా ఉందని. తర్వాత ఏముంది? జీవితేశ్వరి - చెట్టున ఉన్న ఆఖరి ఆకు రాలిపోయినట్టుగా- రాలిపోయింది. ఇంకా తన కేముంది. ఈ లోకంలో? ఆశల తోరణాలు శాశ్వతంగా తెగిపోయాయి. ఆలోచనలు మైదానంపైన నల్లని మేఘాల నీడలు గాఢంగా గుమిగూడాయి. మనస్సు మొద్దుబారిపోయింది. హృదయం శిలగా మారింది. బ్రతుకుబాట బ్రద్దలైంది తనకీ లోకంలో ఇంకా ఏం మిగిలింది?

ఆమె గదిలో ఏకాంతంగా నిలబడి తలుచుకున్నాడు. ఆమె శవం వెంట తల్లీ, తండ్రీ, అన్నయ్యా, బంధువులూ వెళ్ళాక. గదిలోపడే ఎండను చూశాడు - అది ఎంత పేలవంగా, భారంగా, విచారంగా ఉంది? ఆమె బెడ్ ఖాళీగా ఉంది—గదిలో ఒక ప్రక్క డ్రెస్సింగ్ టేబుల్ ఉంది. దానిమీద ఆమె టాయిలెట్ సామాను ఉంది. బుక్ కేస్, డ్రాయర్ - కుషన్ ఉన్నాయి. కాని ఆమె లేదు. అల్మరాలో మందుల సీసాల వరుస ఉంది. ఆ సీసాలను చూడగానే అసహ్యం, కోపం - రేకెత్తాయి - తన దేవతను ఆ మందులు రక్షించలేకపోయాయి. శాస్త్ర విజ్ఞానం ఎందుకూ కొరగాకుండా పోయింది.

"ఆమె వస్తువుల్లో ఏవైనా కావాలంటే తీసికొని వెళ్ళు. ఏం కావాలి?" అన్న దామె తల్లి మరునాడు కాబోలు.

ఆమె డ్రస్సింగ్ టేబుల్ మీద దంతపు ఫ్రేంతో అమర్చబడ్డ చిన్న అద్దం ఉంది. ఆ అద్దాన్ని అడిగి తీసికొన్నాడు.

—ఆ అద్దంలో పద్మావతి ఎన్నిసార్లు తన ముఖాన్ని చూసికొందో! ఆ అద్దంలో చూసికొంటూనే నిత్యం తల దువ్వుకొంటూంది. ఆ అద్దంలో చూసికొంటూనే ఆమె ముఖానికి స్నో రాసుకుంటుంది. పౌడరు అద్దుకొంటుంది. ఆ అద్దంలో చూసికొంటూనే ఆమె కనుబొమలు సరిచేసి కొంటుంది. ఆ అద్దం ఆమె రూపానికి ప్రతిబింబం! ఆ అద్దంలోనే ఆమె చూపు నిక్షిప్తపరచబడి ఉంది. ఆమె యీ లోకంలో లేకపోయినా — ఆ అద్దమే ఆమెను ఇంకా కలిగివుంది. తను బ్రతికున్నంతకాలమూ ఆఅద్దంలో చూస్తూ ఆమె రూపును చూస్తూ వుండొచ్చు. ఆ అద్దాన్ని కలిగి వుండటమంటే — కొంత భాగం ఆమెను కలిగివుండటమే! ఇంటికి తీసికెళ్ళి ఆ అద్దాన్ని గదిలో వుంచాడు.

ఆ అద్దాన్ని ఎన్నోసార్లు పొగిడాడు. ఇంకా అభినందిస్తూనే ఉన్నాడు. ఆ అద్దమే తన సర్వస్వం ఆ అద్దం ఎన్నోసార్లు ఆమె ముఖం చూసుకోవటానికి ఉపయోగపడ్డ ఆ అద్దం, ఆమె రూపును నిక్షిప్తపర్చిన ఆ అద్దం, ఆమెకు బాగా ప్రియమైన ఆ అద్దం — అట్లా రూములో ఉండాల్సిందే! ఆ అద్దం పట్టుకొని, లోపలకు చూస్తూ — ఏదో అనిర్వచనీయమైన మూగ భాషలో ఆమెతో సంభాషిస్తూ, అమరానుభూతిని పొందుతూ వుంటాడు.

ఆ అద్దం దంతపు కేసులో అమర్చబడి- ప్రక్కనున్న చిమ్నీ షెల్ఫుమీద ఉంది. అదే దాని స్థానం. ఆయన యెప్పుడూ అక్కడే వుంచుతాడు — యెప్పుడు చూడాలను కుంటే అప్పుడు చూసికొనేందుకు వీలుగా వుండేట్టు.

కుర్చీలోంచి వెనక్కు వంగి — దానికేసి చూశాడు. ప్రొఫెసర్ రంగనాథం. కొంతసేపు నేత్రాలు దాన్ని చూస్తూ అలానే ఉండిపోయాయి—

"ఆమె తనని వివాహం చేసికొని వుంటే చనిపోయి వుండేది కాదు తన ప్రేమ అభిమానం, శ్రద్ధ ఆమెని బ్రతికించేవి. ఆమె చనిపోయి వుండేది కాదు." అప్రయత్నంగా, మగతగా మనస్సులో ఆ మాటల్నే మరీ మరీ అనుకున్నాడు. నేత్రాలను దంతపు కేసుమీద నిలిపి — ఆ కేసు మధ్యలోనే పద్మావతి ఫోటో అమర్చబడి వుంది. కొన్ని నిమిషాలు అలానే గడిచాయి.

కొంతసేపటికి ఆలోచననుంచి మెల్లగా మేల్కొని, ముందుకు వంగి — చేయిని ఆ కేసుమీద పెట్టాడు— అద్దాన్ని తీసుకొనేందుకు. ఆ అద్దాన్ని పట్టుకుందామని, నిమురుదామని, లోపలకు చూద్దామని, పద్మావతితో మాట్లాడదామని అనుకున్నాడు. అద్దాన్ని దగ్గరకు తీసికొనేందుకు దంతపు కేసుమీద చేయి వేసేసరికి—ఎందుకో వ్రేళ్ళు వణికాయి. వ్రేళ్ళనుంచి సడలి అద్దం జారి క్రిందపడి పగిలిపోయింది.

ఆ ధ్వని ఆయన హృదయంలో గింగురుమున్నది. కుర్చీలో కూలబడి, మెడ ప్రక్కకు వ్రేలాడవేసి కళ్ళు మూశాడు. గుండె వేగంగా కొట్టుకుంటుంది. తన కేదో ఆపద సంభవింపనున్నదని తెలిసికొన్నాడు.

అస్పష్టంగా రాతిమీద ఉన్న పగిలిపోయిన గాజు ముక్కల్ని చూశాడు. గుండె దడ జాస్తి అయింది. ఏదో కొన్ని శక్తులు ఎక్కడిక్కో చీకట్లోకి, అగాధంలోకి-లాక్కెళ్తున్నట్టు "ఫీ" లయ్యాడు.

పగిలిన గాజు పెంకుల్ని తాకాలని, హృదయానికి హత్తుకోవాలని అనుకున్నాడు. కాని — చేతులు సత్తువను కోల్పోయాయి. సహాయంకోసం కేకలు వేయాలనుకున్నాడు —కాని నోరు అనుమతించలేదు, పద్మావతి రూపాన్ని కళ్ళ ముందుకు తెచ్చుకోవటానికి ప్రయత్నించాడు. కాని లాభంలేకపోయింది. లోతు తెలియని అగాధం— ఏవో శక్తులు లాక్కెళుతున్నట్టు, ఎక్కడికో వెళ్ళుతూన్నట్టు... అంతే! అంతకంటె స్పృహ లేదు. అదైనా...

* * *

"అవును. ఆయన చనిపోయాడు" అన్నాడు డాక్టర్ "కొన్ని గంటల క్రితమే చనిపోయి వుంటాడు. కుర్చీలో కూర్చుని ప్రశాంతంగా కన్నుమూసి ఉండాలి."

"పాపం! దేవుడులాంటి మనిషి" అన్నది పోర్టర్ భార్య సానుభూతిగా

పగిలిపోయిన గాజుముక్కలు పకపకా నవ్వినై.



# పాడుగూ - వెడల్పూ

ఇంకా తొలికోడి మేల్కొలేదు. చీకటి చెక్కు చెదరలేదు. వార్థక్యాలోపడ్డ రాత్రి వెలుగుకోసం దరఖాస్తు పెట్టుకుంది.

రవీస్ కెనాల్ కట్టపైన ఓ గుడిసెలో కోడిగుడ్డు లాంతరు మరణవేదన పడుతూ—చీకటికేసి చేతులు చాస్తూ వుంది. లావుపాటి ఎర్రచీమ అన్యాయంగా కసి తీర్చుకోగా, కుక్కిమంచంలో తల్లి ప్రక్కన పడుకొన్న మూడునెలల పసిపాప కెవ్వున కేకవేసింది. తల్లి సగం నిద్రలోనే పిల్లను సముదాయించింది. ఈతాకుల చాపపై పడుకొన్న తండ్రి పీడకలనుంచి బయటపడ్డట్టు - పిల్ల ఏడ్పుకు లేచి కూర్చున్నాడు.

తన కూతతోనే తెల్లవారబోతోందన్న అహంకారం కొద్దీ తొలికోడి దీర్ఘం తీసింది.

తల్లిపక్కలోని పిల్ల ఏడ్పు మానలేదు. తల్లి విసుగ్గా లేచి కూర్చుంది. తీవ్రంగా గొణుక్కుంది. "ఈ పాడు సంతుకు ఏడ్పు దప్ప మరో పనిలేదు."

తెల్లవారబోతోందని తొలికోడి కూతతో గ్రహించిన రిక్షా రామన్న యీతాకుల చాప చుట్టుతూ భార్య

మాటలకు బదులుగా నిట్టూర్పు విడిచాడు. తను సముదాయించేందుకు ప్రయత్నించాడు

పదకొండు రోజులుగా టైఫాయిడ్ జ్వరంలో మంచంపై కాపురంచేస్తున్న భార్య భర్తకేసి మహా రోతగా చూసింది—యీ కొంపలోని దారిద్ర్య దేవతకు నువ్వే ముఖ్యకారకుడివి అన్నట్టు. ఘోషమీదకొచ్చి మూడు మాసాలైనా ఆపిల్ల ఆకలికొద్దీ ఏడ్పు మానలేదు భూలోకంలో బాగా బ్రతుకుదామని ఆశపడ్డ ఆపిల్లకు ఆదిలోనే ఆకలి రాక్షసి అపురావుకు మనడం గోచరించింది!

తల్లి రొమ్ములకు పాలులేవు. ఆ సంగతి పసిపిల్లకు తెలీదు. తెలిసిన మొగుడు మటుకు—"ఏం పాలు లేకపోతే? కాస్త పిల్లను రొమ్ములకు అదుముకుని సముదాయించ కూడదూ!" అనుకున్నాడు కాని భార్య జ్వరపు ముఖంలో కొలిమిలో నిప్పులాంటికోపం పిలిస్తే పలుకుతోంది. అందుకే ఠక్షా రామన్న వానలో తడిసిన బొగ్గుముక్కలమల్లే చప్పగా వూరుకున్నాడు

పసిపిల్ల పాలకోసం గుక్కపట్టి ఏడుస్తూనే వుంది. గుడిసెలోని కోడిగుడ్డు లాంతరు సానుభూతిగా కన్నుమూసింది.

తూర్పు రేఖలు తెల్లబడుతూ తెల్లవారస్తోందని తెల్పుతున్నాయి.

"హోటల్ కెళ్ళి పిల్లకుపాలు పట్టుకొస్తాను" అన్నాడు రామన్న. దండేన వున్న పైపంచ తీసుకొని తల గుడ్డ చుట్టుకొంటూ.

"ఊఁ" మూలిగింది భార్య పిల్లను ఒళ్ళోకి తీసుకొంటూ.

గుడిసె వెలుపలికి వచ్చాడు రామన్న. చొక్కా జేబులో కుడిచేయి పెట్టి తడిమి చూశాడు. మూడు నయా పైసలూ, ఎంగిలి చుట్ట పీకె తగిలాయి. కిరాయి తోలి, బోణీతో పాపకు పాలు తేవాలి అనుకున్నాడు. రోడ్డుపక్కన నిలబెట్టి వున్న రిక్షాని తొక్కుకుంటూ – స్టేషనుకేసి వెళ్లాడు రామన్న జి. టి వచ్చే టైమయిందని అనుకుంటూ.

జి. టి. అరగంట, ఎక్స్‌ప్రెస్ అరగంట లేటు

మెయిల్ కూడా రాలేదు.

స్టేషనుముందు రిక్షా డ్రైవర్లు రైళ్ళకోసం, ప్రయాణీకులకోసం – సందడిచేస్తూ, ఎదురుచూస్తున్నారు.

బందర్నుంచి ప్యాసెంజరు వచ్చింది. రిక్షావాళ్ళు ఎగబడ్డారు. రామన్న రిక్షాకు బేరం తగల్లేదు. ప్రయాణీకుల్ని సూదంటు రాయిలాగా ఆకర్షించే నేర్పు రామన్నలో లేదు. 'ఏయ్! రిక్షా!' అని ఎవరైనా పిలిచేవరకూ–ఇది రిక్షా ఎక్కే ముఖమని తేల్చుకోలేడు.

అయిదు నిముషాలు గడిచేసరికి జి. టి. ఎక్స్‌ప్రెస్ వస్తోందన్న కలకలం బయలుదేరింది.

రామన్న రిక్షాకి బేరం వచ్చింది. అప్పుడే తూర్పున సూర్యోదయమైంది. పట్టణమంతా నిద్రనుంచి మేల్కొని, కళ్ళు నులుముకుంటూన్నట్టుగా వుంది వాతావరణం. రెండు వందల పాతిక పౌన్లకు రెండు పౌన్లు తక్కువగల బరువైన ఓ వ్యక్తి గాంధీనగరానికి – మూడు అణాల కిరాయితో

రామన్న రిక్షాని మాట్లాడుకొని, జాగ్రత్తగా ఎక్కి కూర్చున్నాడు. సైకిలు రిక్షా టైర్లు సిమ్మెంటు రోడ్డుమీద 'అమ్మ బాబోయ్' అంటూ నిట్టూర్పు విడిచాయి.

రామన్న రిక్షా సాధ్యమైనంత వడిగా తొక్కుతున్నాడు రోడ్డుమీద వచ్చే పోయే మనుష్యుల్నీ, ఎదురుగ్గా వచ్చే వాహనాల్ని తప్పించుకొంటూ జాగ్రత్తగా రిక్షాని పోనిస్తున్నాడు. గంటమీద చేయి అల్లలాడుతూనే వుంది. రిక్షామీద కూర్చున్నలావుపాటి మనిషి వీధికి అటూ ఇటూ చూపుల్ని పారేసుకుంటున్నాడు. రిక్షా చక్రాలు రివ్వున తిరుగుతున్నాయి. రామన్న మనస్సుకూడా అట్లానే తిరుగుతూన్నది. **పొడుగూ - వెడల్పూ**

...ఇంటికాడ పాప పాలకోసం గుక్కపట్టి ఏడుస్తూ వుంటాది తల్లిదగ్గర పాలులేవు. పైగా దానికి జొరం. ఈ కష్టాలన్నీ తనబోటి పేదాడికి ఒక్కసారే రావాలా ? బగవంతుడికి కాపాటి దయ వుండక్కర్లా! తనేం చేస్తాడు? రాత్రి పగలూ కాళ్ళు అరిగిపోయేట్టు, వొళ్ళు కుమిలిపోయేట్టు రిచ్చా తొక్కినా రూపాయి డబ్బులు మిగలవు. దానితో పొయ్యిమీద కుండ ఎక్కాలి మరి దాని రోగానికి మందు లేడనుంచి వత్తాయి? పిల్లదానికి పాలెట్టా వత్తాయి ? తను సోమరిపోతు కాదాయె. రాతిరీ పగలూ రెక్కలాడిత్తూనే వుంటున్నాడాయె! బగవంతుడు పాపంసేసి నోళ్ళకుగాని ఈ దరిద్రపు బతుకీయడు కామోసు! యెనక జనమలో తను కుసింత కెట్టూరి పాపంచేసి వుంటాడు. అందుకే ఈ జనమలో యీ నరకం. అయినా రిచ్చా తొక్కేవాళ్ళ బతుకులన్నీ

యిట్టాగే నేడ్చినాయనా? కాదు. ఆ నరసింహులుగాడూ, మస్తానయ్యా, కోటినాగులూ, పగులుగోడూ- యీళ్ళంతా ఎంత జలసాగా, పైలాపచ్చీసుగా బతుకుతుంటారు. సీటికి మాటికి టీలు, సిగిరెట్టులు, కిల్లీలు, సినిమాలు, అప్పుడప్పుడు తెల్ల కాపీ- నా సామిరంగ వాళ్ళకి కాలం కైలాసంలో జరిగి నట్టుగా జరిగిపోతుండాది. మరి తన కరమ యిట్టా కాలిందేం ...తనకి కాలంకొద్దీ బతకడం సేతకాదు. వేషవ్వేసాలు వేయలేడు. అబద్ధాలతో నాలికను తడుపుకోలేడు. మోసముతో ముద్దను మింగలేడు. అన్యాయానికి కళ్ళు మూసికోలేడు. తనలో వుండ తెగులే యిది ఈ తెగులుగల మనుసులు యీ రోజుల్లో సుకంగా బతకలేరు. ఆళ్ళకి కష్టాలే కాలచ్చేపం సుకాలు మాటుకు కలల్లోకి వత్తాయి. ఈ కష్టాలన్నింటికీ మూలం డబ్బు డబ్బుంటే కష్టాలుండవు. దేవుడి పేరు తలవక్కర్లేదు. ఇప్పుడు తనకి కసీసం వంద రూపాయలైనా వుంటే, యీ కష్టా లుండవు. దీనిని డాకటేరు కాడకు తీసికెల్లి మంచి మందు యిప్పించవచ్చు. రోగం తొరగా నయమవుతాది. పసిగుడ్డు పాలకేడ్వాల్సిన పనిలేదు. కాని యివన్నీ గొంతెమ్మ కోరికలు. ఇప్పుడు తనకి వంద రూపాయ లెక్కణ్నుంచి వత్తాయి? తన బతుకింతే! యీ కష్టాలు, దరిద్రం, కుమిలి కుమిలి యేడ్సు రేపెట్టా గడుత్తాదనేదిగులు. రోజంతా పేగులు వూడిపడేట్టు రిచ్చా తొక్కడము... ఇదే తన బతుకు... ఆలోచించుకుంటూ రామన్న రిచ్చా తొక్కుతూండగా గాంధీనగరం వొచ్చింది.

మూడు మలుపుల వరకూ రిక్షామీద కూర్చున్న

లావుపాటి వ్యక్తి సూచన యిచ్చి, నాలుగో మలుపులో ఓ కొత్త డాబా రాగానే, "ఏయ్! రిక్షా ఆపు" అన్నాడు.

రిక్షా ఆగింది.

రిక్షామీద కూర్చున్న లావుపాటి వ్యక్తి రిక్షామీద కూర్చుండే ఒక్క జేబులోంచి మూడణాలు తీసి- "ఇదిగో" అని రిక్షావాడికిచ్చి, గబగబా కొత్త డాబాలోకి వెళ్ళాడు.

రెండు బార్ల పొద్దు పైకి ఎక్కింది. ఎండ ఉన్నదున్నట్టుగా పడుతోంది. "బాగా పొద్దెక్కింది. పిల్లది పాలకోసం ఎట్లా ఏడుస్తున్నాదో" అనుకుంటూ రామన్న రిక్షా వెనక్కు త్రిప్పాడు. వంద గజాల దూరం వెళ్ళాక వెనక్కు తిరిగి రిక్షా సీటుకేసి చూశాడు ఏదో చప్పుడు అవుతూంటే రిక్షా సీటు ప్రక్కన చిన్న తోలుసంచీ ఉన్నది. వెంటనే రిక్షాఆపి, దిగి చూశాడు రామన్న. "ఆ లావుపాటి బాబుది కామోసు. మరిచిపోయాడేమో!" అనుకున్నాడు, అనుకుంటూనే అప్రయత్నంగా చిన్న తోలు సంచీ విప్పి చూశాడు. కళ్లు బైర్లు కమ్మినంత పర్యంతమైంది.

మూడు పదిరూపాయల నోట్ల కట్టలు, నాలుగు ఐదు రూపాయల నోట్ల కట్టలు "అమ్మ బాబోయ్! ఎంత డబ్బు! ఎంత డబ్బు!" అని రామన్న మనస్సు పొలికేక పెట్టింది. అంతలోనే వొళ్ళంతా చెమట దిగజారింది. కాళ్ళూ, చేతులు గుండె, గజగజ వొణక నారంభించాయి. వెనక్కి ముందుకీ ముందుకూ వెనక్కీ, చుట్టుపక్కలా— బెదురుగా భయంగా భయంగా బెదురుగా, గాబరాగా చూశాడు.

రిక్షాని అప్రయత్నంగా వెనక్కు మళ్ళించాడు.

ఎండలో వేడిమి హెచ్చింది. రామన్న బుర్రలో ఆలోచనలు కూడా వెచ్చబడ్డాయి.

...ఎంత పైకం ! ఎంత డబ్బు !...తను లెక్కపెట్ట లేదు. ఇయ్యాల తను లేసి వోడి ముకం సూసినాడో - ఎంత పైకాన్ని కళ్ళజూశాడు? ఇంతమటుకు బతుకులో తను యింత డబ్బును కళ్ళారా సూడలా. లచ్చిందేవి తనపై దయ సూపి- యీ పైకం తన రిక్షాలో వొదిలేసేట్టు సేసింది. ఈ పైకాన్ని తనేం సేయాలి? ఎట్టా ఉపయోగించుకోవాలి?... ఇప్పుడు తను దరిద్రుడు కాడు. ఈ డబ్బుతో తన దరిద్రం వొదులుతాది. ఇక రిచ్చా తొక్కక్కర్లేదు. పసిగుడ్డు పాలకి ఏడ్వక్కర్లే. దాన్ని తను పెద్ద డాక టేగు కాడకు తీసికెళ్లొచ్చు. రోగం నయం సేయించొచ్చు. కాబట్టేనన్ని సిలుకు చీరలు బంగారం నగలూ కొనొచ్చు. తను ఇంకా ఆ మురికి గుడిసెలో కాలవకట్ట సెంత వుండక్కర్లా. ఓ పెంకుటిల్లు అద్దెను తీసికొని అందులో దిట్టంగా వుండొచ్చు. ఏదేనా చిన్న బిజినెస్ సేయొచ్చు. నాలుగు రిచ్చాలు కొనిపడేత్తే, రోజూ ఓ పదిరూపాయల కాడకు వస్తాయి. కాలుమీద కాలేసుకొని - జల్సాగా బతకొచ్చు. రెండు మూడేళ్ళలో పడ పదిహేనేలు సంపాయించొచ్చు. ఆ మీద ఇంకా పెద్ద బిజినెస్ సేసి, లచ్చలు సంపాయించొచ్చు. రిచ్చా తొక్కే రామన్న లచ్చాదికారయ్యాడని దేశమంతా ఆగుబ్బుగా సెప్పుకుంటారు కామోసు ! అప్పుడు పెద్ద మేడ కట్టొచ్చు, సేక్‌మెన్ గారి మేడంత పెద్దది, నల్లటి, బారాటి కారు కూడా కొనవచ్చు. తనూ, అదీ, పిల్లలూ ఆ కారులో సికార్లకీ, సినిమా

లక్, పోతూంటే - నా సామిరంగ, యీ రిచ్చా తొక్కే నరసింహులూ, మస్తానయ్యా, కోటినాగులూ, పగులుగోడూ నోరు తెరిసి, ముక్కులమీద యేళ్లు యేసుకోవాల్సిందే!... ఏముంది? అదృష్టదేవత సల్లని సూపు సూస్తే- బళ్లు ఓడలవు తాయి; గుడిసెలు మేడలవుతాయి; రిచ్చా తొక్కేవాళ్లు లచ్చాధికార్లవుతారు ఇదే లోకంలో గమ్మత్తు! బగవం తుని యిసితర!...

మెర్క్యూరీ లైటు కాంతివలె సంతోషం మనస్సులో వెలుగుతూంటే, రామన్న రిక్షా తొక్కుకుంటూ ఆ లావుపాటి వ్యక్తి కొత్త డాబా ముందుకే వొచ్చాడు, ఆ పైన సైకిలు రిక్షా పెడల్స్ పైన కాళ్ళు ఆనలేదు. రిక్షా కదల్లేదు. రిక్షామీదనుంచి రామన్న దిగాడు. అంతా అయోమయంగా తోచింది. తనేం ఆలోచించాడు? తనేం చేయబోతున్నాడు? తనేం చేయదల్చుకున్నాడు?- ఏది సబబు? ఏది న్యాయం ...ఏది ధర్మం?...రిక్షా రామన్న మనస్సులో ఆ కొత్త డాబా ముందు కొన్ని క్షణాలపాటు తీవ్రమైన సంఘర్షణ జరిగింది. ఇంట్లోకి వెళదామా? ఆ సంచీ ఇద్దామా? అబ్బే! అంతడబ్బు, తిరిగి యిచ్చేయటమే! తన బ్రతుకు, తను వూహించిన అందమైన జీవితం! ఎట్లా ఆడబ్బు తిరిగి యివ్వడం?-ఛీ, వెధవది. న్యాయం న్యాయమే. ధర్మం ధర్మమే. తనరిక్షాలో దొరికిన వస్తువును తను దాని యజమానికే అందజేయటం న్యాయం. ధర్మం, అన్యాయపు

కూటికే ఆశపడ కూడదు. ఆశపడినా—అది నిలవదు. తను యిచ్చేయటమే సబబు

రామన్న అంతర్మనస్సు న్యాయం ధర్మం ప్రక్కకు మొగ్గు చూపింది. మనస్సు పైని మాయమబ్బులు పెను గాలికి గడ్డిపోచలలా తొలగి పోయాయి. కొన్ని క్షణాల తర్వాత రామన్న మనస్సు-వాన కురిశాక వచ్చిన తెల్లఎండ వలె ఐంది. కొత్తశాబా వరండాలోకి వెళ్ళాడు. ఆ లావుపాటి వ్యక్తి వాకిటతెర తొలగించుకొని, పేపరు చేత్తో పట్టుకొని వరండాలోకి వచ్చాడు.

బాబుగోరూ! ఇందాక మీరు రిక్షాలో యీ తోలుసంచీ మర్చిపోయినారు” అన్నాడు రామన్న సవినయంగా.

రెండువందలపాతిక పౌన్లకు రెండుపౌన్ల తక్కువ బరువుగల ఆ లావుపాటి వ్యక్తి-రబ్బరుబంతివలె ఎగిరిగంతేసి ఆ చిన్న తోలుసంచీ తీసుకున్నాడు.

“నా మతిమరుపు మండిపోనూ! ఈ డబ్బుసంచీనే రిక్షాలో వదిలేశానన్నమాట. ఇందులో అయిదువేలరూపాయలున్నాయి” అంటూ ఆ లావుపాటివ్యక్తి గబగబా సంచీ తెరిచి పైకం చూసుకున్నాడు. సంపూర్ణంగా సంతృప్తి పడ్డాడు.

“నువ్వురా అబ్బీ యీ యుగంలో సత్య హరిశ్చంద్రుడి లాంటి మనిషివి అంటే, నీ నిజాయితీకి, న్యాయమైన బుద్ధికి, సత్ప్రవర్తనకూ—హృదయ పూర్వకంగా మెచ్చుకుంటున్నాను. నిజంగా నువ్వు దేవాంశ సంభూతుడవంటే అతిశయోక్తికాదు. కనుకనే యీరోజుల్లో యింతమొత్తం

పైకంగల సంచీని ఆశరవ్వంతకూడా లేకుండా నీతికి నిజాయితీకి నిలబడి భద్రంగా తీసికొచ్చి అప్పగించావు. నిన్ను ఎంత గొప్పగా పొగిడినా మాటలు చాలవు రుజువర్తన అనేది సహజంగా వచ్చేదేగాని - జబ్బువల్లరాదు. కనకాలకు దాసుడుకానివాడే వాస్తవమైనవ్యక్తి. అతనే పుణ్యాత్ముడు. అతనే మోక్షానికి అర్హుడు. అతనే భగవంతుని కరుణా కటాక్ష వీక్షణాలకు పాత్రుడు. సరే! నువ్వు వెళ్ళు అబ్బీ! అవతల నాకు బోలెడంత పనివుంది" అంటూ వాకిటి తెర తొలగించుకొని గబగబా ఇంట్లోకి వెళ్ళాడు. రెండువందల పాతిక పౌన్లకు రెండుపౌన్ల తక్కువ బరువుగల ఆ సన్నపాటి వ్యక్తి.

ఆమాటలు విన్న రిక్షా రామన్నకు మనస్సు ఆవిరియైంది. రిక్షా తొక్కుకుంటూ బీసెంటురోడ్డుమీదకొచ్చాడు. కాని ఏదో పోగొట్టుకున్నట్టుగా నోటిదగ్గరవరకూ వచ్చిన అమృతపాత్ర జారిపోయినట్టుగా బెంగగా, అశాంతిగా-'ఫీల్' కాజొచ్చాడు.

పదమూడు నయాపైసలిచ్చి అరకప్పు పాలుపోయించుకున్నాడు సత్తుగ్లాసులో-పాపకోసం. మెల్లగా రిక్షాని నడిపించుకుంటూ ఆ పాలగ్లాసుని తీసికెళ్ళుతున్నాడు రామన్న. కాని అతని మనస్సులో ఆ నోట్లకట్టలు తోరణాలవలె వ్రేలాడుతూ గేలిచేస్తూనే వున్నాయి 'ఎవరికైనా నోచుకోవాలి'-అంటూన్నట్టున్నాయి.

ఎండ రంగూ, తీక్షణతా ముదురుతున్నాయి. రోడ్డుమీద సందడికూడా హెచ్చుతున్నది.

ఒక నల్లటి బారాటికారు ఎండలో మెరిసిపోతూ తన హోదాను ఇనుమడింపచేసే హారన్ మోతతో వేగంగా రోడ్డుపైని దుమ్మును దిట్టంగా లేపుతూ, రామన్న రిక్షా ప్రక్కగా దూసుకుపోయింది పరధ్యానంలోఉన్న రామన్న భయపడి, బెదిరి, మనస్సు ఒక్కసారి బెదిరి రిక్షాను కారు క్రింద పడకుండా చేసే జాగ్రత్తలో పాలగ్లాసును రోడ్డుపై జారవిడిచాడు. కారు దుమ్ము కళ్ళల్లో జోరుగా పడగా కళ్ళు నులుముకున్నాడు. తెల్లనిపాలు రోడ్డుదుమ్మును కరచాయి. రామన్న మనస్సు బావురుమన్నది. కళ్ళల్లో నీళ్ళు తొంగి చూశాయి. రోడ్డుమీద నడిచే జనంకుంతా - తమ కళ్ళను దుమ్మునుంచి కాపాడుకోవటంలో సతమతమయ్యారు. కానీ రామన్న కళ్ళల్లో నీళ్ళు ఎందుకు తొంగిచూశాయో గమనించలేరు. కాని అతని కళ్ళల్లో నీళ్ళు కారుదుమ్ము పడి తొంగిచూడలేదు.

రామన్న కళ్ళముందు-పాలకోసం గుక్కపట్టి యేడ్చే పసిగుడ్డు మెదిలింది. రామన్న కళ్ళముందు పసిగుడ్డు మీద విసుగుతో విరుచుకుపడే భార్య మెదిలింది. రామన్న కళ్ళు నీటిని వర్షించాయి రామన్న మనస్సులోంచి ఆ నోట్ల కట్టల శోభ తొలగిపోలేదు. రామన్న హృదయం ఖేదంతో మూలిగింది.

"ఏయ్! రిక్షా" పేవ్‌మెంటుమీద నిలబడి ఎవరో పిలిచారు.

రామన్న ముఖంపైని దుఃఖం ఒకసారి దిగజారి-ఆశా రేఖలు నిక్కబొడుచుకున్నాయి.

"బాబూ!" అంటూ వాళ్ళదగ్గరకెళ్ళాడు.

కాళేశ్వరరావు మార్కెటు దగ్గరకు పావలా యిచ్చేట్టూ, ఇద్దరు వ్యక్తులు రిక్షాలో ఎక్కేట్టూ మాట్లాడుకున్నాడు.

రిక్షా తొక్కుతూ ఈ పావలా కిరాయిలో బేడ కిరాయితో, తమ పాపకు పాలు కొనుకుని వెళ్ళవచ్చు ననుకున్నాడు రామన్న. ఆ ఆశే అతని ఖేదానికి తాత్కాలికంగా ఉపశమనం కలిగించింది.

రామన్న కాళేశ్వరరావు మార్కెట్టు తిన్నగా రిక్షాని ఆపాడు. వాళ్ళు దిగారు. పావలాబిళ్ళ రామన్న ముఖాన విసరివేసి, గబగబా మార్కెట్టులోకి వెళ్ళారు. ఆ పావలా బిళ్ళ తీసికొని గబగబా రామన్న హోటలుకు వెళ్ళి, బేడ పాలు పోయమని సత్తుగ్లాసు యిచ్చాడు.

ఆ పావలా బిళ్ళని అటూ ఇటూ, ఇటూ అటూ, తల్లక్రిందులుగా పట్టిచూసిన హోటలు ప్రొప్రైటరు- ఒక విషపు నవ్వు నవ్వి, "ఈ పావలా మారదు" అన్నాడు కోపముతో కంఠాన్ని ఖంగు మనిపిస్తూ.

రామన్న ముఖం చితికిన టొమేటోలాగైంది. నీళ్ళు కారిపోయాయి. నీరసంతో నేలమట్టమైనాడు నోట మాట రాలేదు. నిముషమున్నరసేపు అట్లాగే నిలబడిపోయాడు.

హోటలు ప్రొప్రైటరు విసిరేసిన మారని పావలాని రోడ్డుమీదనుంచి తీసికొన్నాడు. "ఎంత మోసం ?" అనుకున్నాడు.

“ఏం రామన్నా! ఇయ్యాల ఏపాటి కిరాయి దొరికె నది?” అంటూ సుబ్బులు రిక్షా తొక్కుకుంటూ వచ్చాడు.

“నాబోటి ముకాలకేనా కిరాయి దొరికేది ?” అన్నాడు రామన్న నిరాశ ధ్వనించే విసుగుదలతో.

“ఏం అట్లా అంటావు! ఇంకా బోణీ పలకలేదా, ఏంటీ!”

“పలికింది. పలక్కేం ?”

“అయితే–”

“సూడు, సుబ్బులూ! ఈ పావలా బిళ్ళ సెల్లదా ?”

ఆ పావలా బిళ్ళను చేతికేసి ప్రయోగించి చూసి – క్రిష్ణా బ్రిడ్జిమీద జనతాకింద బెట్టు. అంతకు తప్ప యిడిసి యిదెందుకూ పనికిరాదు. ఎట్టా మోసపోయావు రామన్నా ! మడిసిలో మెతకుంటే అంతా యిట్టాంటి సరుకే గిడతాది” అన్నాడు సుబ్బులు.

సుబ్బులు కూడా రిక్షా తొక్కేవాడే. రామన్న గుడిసె ప్రక్కనే రైవీస్ కెనాల్ కట్టపైన వుంటున్నాడు. ఇద్దరూ ఒకే వృత్తిలో స్నేహితులే కాకుండా – ఇరుగు పొరుగువాళ్ళు. సుబ్బులు పదునైన నైజం గలవాడు. కాలంలో మార్పుకొద్దీ తన ప్రవర్తనలోను ఎప్పటికప్పుడు మార్చుకొనే నిపుణుడు. పరుగెత్తి పాలు త్రాగుదామనే ఆశ గలవాడేగాని నిలబడి నీళ్ళు త్రాగుదామన్న శాంతి స్వభావి కాడు.

సుబ్బులు మాటలకు రామన్న పంచరుబడ్డ సైకిలు ట్యూబులాగే నిట్టూర్చాడు

"పసిపిల్ల ఝామును ఝాంకాడనుంచీ పాలకోసం ఏడు స్తాది. కిరాయితో హోటల్లో పాలు తెస్తానని సెప్పినా ఇంకా యీడనే దేకుతున్నా.

"ఓస్ ! అంతేనా ?" సుబ్బులు తుస్కారంగా నవ్వాడు.

"నువ్వట్టే మనేద బెట్టుకోవాక. నేను హోటల్లో పాలు తెచ్చి యిచ్చానులే. నిదర మంచంమీద లేచే తల్లికి మీ పసిదాని ఏడుపు వినవచ్చింది. సంగతి కనుక్కొని నువ్వు పాలు తెచ్చే తల్లికి ఎట్టాగూ సూరేడు నెత్తిమీద కొస్తాడని సెప్పి, నేనే తెచ్చి యిచ్చా" అన్నాడు సుబ్బులు బెంగుళూరు బీడీ ముట్టిస్తూ.

"ఆఁ! యాందీ" రామన్న అపరిమితమైన ఆశ్చర్యములో అపూర్వమైన ఆనందాన్ని పొందాడు. అతని ముఖం ఒక్కసారి సంపూర్ణమైన సంతోషంతో యింక్ డ్లీ సోపుతో మూడుసార్లు తోముకున్నంత వికసించింది.

కొన్ని క్షణాలపాటు ఇద్దరిమధ్యా నిశ్శబ్దం నిటారుగా తల ఎత్తింది రామన్నను పూర్తిగా ఉల్లాసపడనిచ్చి, 'ఏంటీ! యియ్యాల యిశేశాలు?" అన్నాడు సుబ్బులు బీడీ పొగ వూదుతూ.

'ఇయ్యాల నేను బలేగనకార్యం సేసినా' అన్నాడు రామన్న ఆనందోత్సాహాలు మనస్సులో కుస్తీ పడుతూండగా. సుబ్బులు కనుబొమలు ప్రశ్నార్థంగా ఎగురవేశాడు.

రామన్న తనకు రిక్షాలో అయిదువేల రూపాయల చిన్నతోలు సంచి దొరికినట్టు, దాన్ని తను న్యాయానికి

ధర్మానికీ కట్టుబడి భద్రంగా తిరిగి ఆ లావుపాటి యజమాని కిచ్చినట్టు చెప్పాడు. అంతా విని సుబ్బులు సీమటపాకాయ పేలినట్టుగా అన్నాడు.

'ఏడిశావ్! ఎర్రినాగన్నా! వోడన్నా అంత పైకం దొరికతే-వూరకనే ఇడిసిపెడతాడా ?...ఎంత యివరం తక్కువ పనిచేసేవురా పిచ్చి సన్నాసీ! వెయ్యేళ్లు రిక్షా తొక్కితేమటుకు-అంతడబ్బు మనచేతికొస్తదా? ఛా. ఛా. సేతిలోకొచ్చిన లచ్చిని-జారవిడిశావ్! ఈ దరిద్రపు బతుకే నీకు సుకంగా వుందా? నీకు కలిసుపెట్టను సేతకాకపోతే మాబోటి వాళ్ళం ఎంతమందిమి లేము? నిమిట్టమీన రూపాయిన్ని అల్లల్లాడించే వాళ్ళం! యింతకూ సేతిలో గీత వుండాలి. నీకు పదిరూపాయలన్నా బహుమానం యిచ్చినాడా!"

"ప్చ్" పెదవి విరిచాడు రామన్న.

"ఎందుకిత్తాడూ! భాగా మెచ్చుకొని మేకతోలు కప్పివుంటాడు. అంతేగదూ! అడినేవుంది కిటుకు. మంచితనానికి మెప్పుదల మాటలేగాని-ఫలితం శూన్నమేగా! డబ్బుగలోళ్ళకి దయతక్కువ అది ఆళ్ళకు లాభమే. డబ్బులేని వాళ్ళకి దయతక్కువైతేనే నష్టం! ఆ కిటుకు కనిపెట్టి నడుసుకోవాలోయ్ రామన్నా! రోజులు ఎట్టా మండిపోతున్నాయో తెలుసా!"

"ఏయ్! రిక్షా!...వస్తావా?" క్లాత్ ఎంపోరియమ్ ముందుండి ఎవరో కేక వేశారు.

రామన్న రిక్షాతొక్కుకుంటూ వెళ్లాడు.

సుబ్బులు బీడీ పీల్చుటం మానేసి రోడ్డుమీద విసిరేసి రిక్షా తొక్కుకుంటూ స్టేషనుకేసి వెళ్ళాడు.

అదేరోజు సాయంత్రం రామన్న ఖాళీరిక్షా తొక్కుకుంటూ అలంకార్ థియేటర్ మీదుగా మెల్లగా వెళుతూండగా-"ఏయ్! రిక్షా! ఆగు" అంటూ ఆలావుపాటి వ్యక్తి పిలిచాడు.

ఎందుకో అనుకున్నాడు రామన్న.

రెండువందలపాతిక పౌన్లకు రెండుపౌన్లు తక్కువ బరువుగల ఆలావుపాటివ్యక్తి ఒక్క ఉదటున రిక్షాలో ఎక్కి కూర్చుని "త్వరగా స్టేషనుకు పోనివ్వు" అన్నాడు.

ఆయన ముఖంలోని ఆదుర్దాని, తొందరనీ, చికాకునూ, కనిపెట్టాడు రామన్న. రిక్షా త్వరగానే తొక్కుతున్నాడు. వెల్‌కమ్ హోటలు దాటాక-

"నువ్వు ప్రొద్దున మొంచి పనిచేశావోయ్" అన్నాడు రిక్షాలో కూర్చున్న లావుపాటివ్యక్తి.

"ఏంటి బాబుగారూ!" అన్నాడు రామన్న

"ప్రొద్దున నువ్వు ఆ డబ్బు నాకు తిరిగి యివ్వాక పోయినా బావుండేది నీబోటి పేదవాడు బాగుపడేవాడు."

'అదేంటి బాబుగోరు! అట్టా అంటారు' అన్నాడు రిక్షా రామన్న తికమకపడుతూ

"ఏముంది? ఆ డబ్బు ఇంట్లో పెట్టాను మధ్యాహ్నం నిద్రబోతున్న సమయంలో దిండుక్రింద తాళంచెవులు తీసికొని, మాయింట్లో తింటూ బి. యె. చదువుకొంటూన్న

బావమరిది ఇనుప్పెట్టెతీసి, ఆ డబ్బుతో పరారీయైనాడు. ఏ హైదరాబాద్ మద్రాస్ వెళ్ళివుంటాడు. వాడ్ని వెతికి పట్టుకొనేసరికి-ఆ డబ్బును కాస్తా హారతి కర్పూరంలా కరిగించి వేస్తాడు నువ్వు నాకు ఆ డబ్బును తిరిగి యిచ్చిన ప్రయోజనమే లేకపోయిందోయ్!... పాపం నీకు బహుమానంగా పాతిక రూపాయలిద్దామనుకున్నాను. తీరా నువ్వు వెళ్ళాక ఆ ఆలోచన మనస్సులో మెరిసింది. డబ్బు దొరికిన సంతోషంలో అప్పుడు నాకు తోచలేదు.

ఆ పాతిక రూపాయలు యిప్పుడిస్తాడేమోనని రామన్న యినుమిక్కిలిగా సంతోషపడ్డాడు.

స్టేషనుమీదుగా సూర్యుడు ఎర్రగా మిడిసిపడుతున్నాడు. నర్సరావుపేట నుంచి ట్రైన్ వచ్చినట్టుంది. ప్రయాణీకులు వస్తున్నారు. లైసెన్సుకూలీలు సామాన్లు చేరవేస్తున్నారు.

రామన్న బుకింగ్ ఆఫీసుముందు రిక్షాని ఆపాడు. ఆ లావుపాటివ్యక్తి క్రిందకు ఒక్క-దూకు దూకాడు రిక్షాస్ప్రింగులు పునర్జన్మను పొందినంత 'రిలీఫ్'తో నిలబడ్డాయి.

"ఎంత యివ్వమంటావోయ్" అన్నాడా లావుపాటివ్యక్తి ప్రక్క-జేబులో చేయి పెడుతూ.

"ఓ పావలాడబ్బులు దయచేయండి బాబూ! వేదోడ్ని" అన్నాడు రామన్న ముసిముసినవ్వులు నవ్వుతూ చేతులు నలుపుకొంటూ.

ఆ లావుపాటివ్యక్తి గండుచీమ కుట్టినట్టు ఎగిరిపడ్డాడు.

"ఈ కాస్తదూరానికి పావలా అటోయ్ ఆశకు అంతుండాలి. ఇదిగో పదమూడు నయాపైసలు. మామూలు కిరాయి" అంటూ పదమూడు నయాపైసలిచ్చి బుకింగ్ ఆఫీసులోకెళ్ళాడు ఆ రెండొందలపాతిక పౌన్లకు రెండుపౌన్ల తక్కువ బరువుగల వ్యక్తి బుకింగు ఆఫీసులోకి చిన్న రోడ్డు రోలరు దొర్లించినట్టుగా నడుస్తూ.

అరచేతిలోపడ్డ ఆ పదమూడు నయాపైసలకేసి చూస్తూ సుబ్బులు అన్న మాటల్ని స్ఫురణకు తెచ్చుకున్నాడు రిక్షా రామన్న

---

# నాన్న మంచివాడు కాదమ్మా !

"అబ్బాయిలూ ! మీరు 'పొదుపు' మాట వినే వుంటారు పొదుపంటే మిగల్చడం. సంపాదించిన డబ్బులో సాధారణ ఖర్చులకు మప్పితంగా వాడుకొని మిగల్చడం, ఆ మిగిల్చిన దానిని నెలనెలా కూడబెట్టడం. 'వాళ్ళు పొదుపుగా సంసారం చేస్తున్నారు' 'ఆ రత్తమ్మ ఎంత పొదుపుగా ఇల్లు గడుపుతూంది.' ఆ సుబ్బయ్య ఎంత పొదుపు మనిషి. ఇట్లాంటి కబుర్లను మనం నిత్యమూ వింటూనే వుంటాము. పొదుపంటే జాగ్రత్తగా ఖర్చుని తగ్గించుకొని - సంపాదనలో నెలనెలా మిగల్చడం. పొదుపు ఉద్యమం భావి భారత సౌభాగ్యానికి పునాది వంటిది పొదుపంటే పెద్ద వాళ్ళతోనే ప్రారంభంకాదు. చిన్నపిల్లలుకూడా పొదుపును చక్కగా అమల్లో పెట్టొచ్చు. అంటే మాకు సంపాదనెక్కడిది, పొదుపు చేయటానికి? అన్న సందేహం మీకు కలుగవచ్చు. కాని పొదుపంటే కేవలం సంపాదించిన డబ్బునే మిగల్చాలనికాదు చేతిలోవున్న డబ్బును అనవసరంగా ఖర్చుచేయకుండా జాగ్రత్త పర్చడంకూడా 'పొదుపు' క్రిందకే వస్తుంది. ఈ పొదుపు చేయాలనే కోర్కె కొంత

మందిలో సహజంగా కలుగుతుంది. మరికొంత మందిలో కుటుంబ సాంప్రదాయంగా అలవడుతుంది. ఏమైనా పొదుపు చేసే అలవాటును ప్రతివ్యక్తీ కలిగి వుండటం తన శ్రేయస్సుకే కాకుండా దేశాభ్యుదయానికెంతో తోడ్పడుతుంది. కనుక అబ్బాయిలూ ఈ వయస్సులోనే మీరు పొదుపు చేయటానికి అలవాటుపడితే పెద్దవాళ్ళయ్యే సరికి ఎంతో కూడబెట్ట గల్గుతారు. ఆ డబ్బును భారత ప్రభుత్వ చిన్న మొత్తాల పొదుపు పథకానికి పెట్టుబడిగా పెట్టవచ్చు. దేశంతో పాటు మీరు కూడా అభివృద్ధిని పొందవచ్చు. ఎట్లా పొదుపు చేయడం? అన్న ప్రశ్న కలగవచ్చు చెబుతాను వినండి.. మీ ఇంటికి ఎంతమందో బంధువులు వస్తూ పోతూ వుంటారు. వాళ్ళు వెళ్ళబోయేప్పుడు ప్రేమగా' అభిమానంగా బేడా, పావలా, కాస్తవున్నవాళ్ళు రూపాయి కూడా పిల్లలికి ఏవో కొనుక్కొని తినమని ఇవ్వటంకద్దు. ఆ డబ్బును పిల్లలు వెంటనే ఏ కోమటి కోటయ్య కొట్టుకో తీసికెళ్ళి పీచు మిఠాయో, పంచదార బిళ్ళలో, బెల్లపుజీడీలో కొనుక్కొని ఖర్చు చేస్తారు. లేదా, పిల్లలేడ్చి మారాము చేస్తే తల్లితండ్రులు అప్పుడప్పుడు అణా బేడా ఇవ్వడం కూడా మామూలే. ఆ డబ్బును కూడ పిల్లలు గబుక్కున చిరుతిళ్ళ పాలు చేస్తారు. అట్లా అనవసరంగా డబ్బును పిచ్చి తిళ్ళకు పాడుచేయక ఒక మట్టిముంత సంపాదించి, ఆ ముంతలో అణా బేడా దొరికినప్పుడల్లా వేస్తుంటే, మీరు పెద్దవాళ్ళయ్యే సరికి ఆ డబ్బులన్నీ కూడి మీరు నమ్మలేనంత మొత్తమవుతాయి అప్పుడు మీ సంతోషానికి, సంతృప్తికి పట్టపగ్గా

లుంటాయా? చిన్నతనంనుంచీ పొదుపుకుఅలవాటైన పిల్లలు పెద్దవాళ్లయినాక వేలు కూడబెట్టడం అతి సులభం. ఒక్క విషయం మర్చిపోకండి ఈ రోజుల్లో డబ్బుగలవాడే గొప్పవాడు, డబ్బుగలవాడే బలవంతుడు, డబ్బుగలవాడే గౌరవనీయుడు, డబ్బుగలవాడే సుఖంగా బ్రతకగలడు. 'ధనమూలమిదంజగత్' అన్నారు. డబ్బుతోనే ప్రపంచం. కనుక అబ్బాయిలారా! నేటినుంచి నా మాటలు జ్ఞాపకం పెట్టుకుని తలా ఒక మట్టిముంత సంపాదించి శ్రద్ధతో పొదుపుచేసి, అణా, బేడా, పావలా - ఎంత దొరికితే అంత అందులో వేయండి నేచెప్పిన పద్ధతిలో - మీలో ఎవరైనా పొదుపు చేస్తూన్న వాళ్ళున్నారా?" అని ప్రశ్నించి క్లాసులో ఉన్న నలభై అయిదుమంది విద్యార్థులకేసి చూశాడు. ఎలిమెంటరీ స్కూలు మాష్టరు శంకరయ్య.

పది సంవత్సరాలు నిండని విద్యార్థులంతా ఒకళ్ళ ముఖాలు కేసి ఒకళ్ళు వింతగా చూసుకున్నారు.

క్లాసు రూములో కొన్ని క్షణాలపాటు నిశ్శబ్దం దిక్కులు చూసింది.

రెండో బెంచీలో కూర్చున్న 'రాము' అని పిలువబడే రామారావులో మటుకు కొంచెం చలనం కలిగింది. అతను తన చుట్టు పక్కల విద్యార్థులకేసీ, పంతులుగారికేసీ బెరుగ్గా చూసి బిడియాన్ని నటించాడు. ఆ పిల్లవాని ముఖములో నిజాన్ని వెళ్ళగక్కే ఆదుర్దా గంతులేస్తూన్నా - ఓ రకమైన బిడియంతో కూడుకున్న భయం పక్క చూపులు

చూస్తోంది. పిల్లవానిలోని ఆ ఇబ్బందిని కనిపెట్టిన శంకరయ్య మాష్టారు.

"ఏంరా! రామూ! మట్టిముంతలో డబ్బు కూడబెడు తున్నావా?" అన్నాడు.

"అవునండి!" అంటూ లేచాడు రాము. వాడిలో బిడియంతో కూడుకున్న భయం పంతులుగారి ప్రశ్నతో గాలిలో పొగ తేలిపోయినట్టు తేలిపోయింది.

"సెహ్‌భాష్‌రా! రామూ! భలే పని చేస్తున్నావు. నువ్వురా ఆదర్శ విద్యార్థివంటే! మిగతా పిల్లలంతా రాముని చూసి నేర్చుకోండి. ఇవాళనుంచైనా మిగతా వాళ్ళంతా మట్టిముంతలు సంపాదించి అణా బేడా కూడబెట్టడం మొద లెట్టండి. పెద్దవాళ్ళయినాక యీ డబ్బూ, అలవాటూ, పద్ధతీ ఎంతో ఉపకరిస్తాయి" అన్నాడు. శంకరయ్య మాష్టారు గంభీరంగా.

ఆ మాటలకు రాము వొళ్ళు గగుర్పొడిచింది. తనను గురించి ఎదుటివాళ్ళనుంచి పొగడ్త లభించగా షష్టిపూర్తి జరిపించుకున్న వృద్ధులు సహితం ఆకాశంలో ఆనందంగా తేలి పోతారు. ఇక పసిహృదయం సంగతి ప్రత్యేకంగా చెప్పాలా? రాము తనలో తాను మృదువుగా మురిసిపోయాడు. గొప్పగా సంతోషించాడు. గోముగా సిగ్గుపడ్డాడు. పాలుగారే ముఖం దోరగా పండిన దానిమ్మపండు కాగా — కళ్ళల్లో ఆనంద బాష్పాలు మెల్లగా తొంగిచూశాయి. తనకు తెలియని సంతోషం పల్చని పెదాలపై పరవళ్ళు తొక్కుతూండగా

బెంచీపై కూర్చున్నాడు క్లాసులోని పిల్లలంతా మాష్టారు మనసారా మెచ్చుకున్న రాముకేసి క్రొత్తభావంతో దిగాలు పడుతూ చూశారు.

హెడ్ మాష్టరు గదిలోని గోడపైని గడియారం పదిన్నర గంటల కాలాన్ని బలవంతాన చూపెట్టగా ప్యూను నరశింహులు నిద్రగన్నేరు చెట్టుకొమ్మకు కట్టివున్న గంటను గణగణ మ్రోగించాడు.

ఎలిమెంటరీ స్కూలులో సందడి పొట్ట ఒక్కసారి చెక్కలైంది. ఇళ్ళకు వెళ్ళే ఉషారులో పిల్లలంతా గబగబా పలకా, పుస్తకాల్ని సంచుల్లో సర్దుకొని బెంచీల మీదుగా దూకి స్కూలు వరండాలోకి వచ్చి తమతమ ఇళ్ళదారి పట్టారు.

ఉతికిన తెల్లచొక్కా, కాకిలాగు ధరించి కాళ్ళకు చెప్పులు లేకుండా గోనెపట్టా సంచీని భుజాన కుడిచేతిలో తగిలించుకొని, ఉదయాన తల్లి తలకు కొబ్బరినూనె రాసి దువ్విన తల పాపిట చెక్కుచెదరకుండా ఎండలో మెరుస్తూండగా, గబగబా శివాలయం వీధిన ఇంటికి నడచి వస్తూన్న తొమ్మిదేళ్ళ ప్రాయంగల రాము తనలో తానే పొంగి పోతున్నాడు వాడి బుల్లి మనస్సులో శంకరయ్య మాష్టారు మెచ్చికోలు రంగుల బొంగరంమల్లె తిరుగుతూంది. వాడి హృదయం నీలాకాశంలో అందంగా ఎగిరే తెల్లగాలిపటం వలె వుంది. పరుగెత్తుకుంటూ వెళ్ళి తల్లితో శంకరయ్య మాష్టారు మెచ్చుకున్న విధం చెబుదామని అనుకుంటున్నాడు గానీ వెధవది సంతోషపు పొంగులో పరుగెత్తలేక

పోతున్నాడు. అక్కడికి పెద్దపెద్ద అంగలే వేస్తున్నాడు. శివాలయం వీధి మలుపుదాటి లైబ్రరీ బజారుకొచ్చాడు.

నాయుడమ్మ కిళ్ళీకొట్టువద్ద నలుగురు చేరి 'కట్ జోకర్' పేకాట ఆడుతున్నారు వాళ్ళల్లో తండ్రి ఉన్నాడేమోనని చూశాడు. కాని అక్కడలేడు. ఆ కిళ్ళీకొట్టు ప్రక్కన జిల్లా లోకల్ లైబ్రరీ అధారిటీవారి శాఖా గ్రంథాలయం, దాని ప్రక్కనే కోమటి కోటయ్య చిల్లరకొట్టు, అది దాటి పదిగజాల దూరంలోనే రాముకు వీధిలోని దుమ్ములో వెచ్చబర్చలేని తెల్లని ఎండలో – తెల్లగా మెరుస్తూన్న అణాబిళ్ళ కనిపించింది. గబుక్కున వంగి దాన్ని తీసుకున్నాడు. వాడిలో ఆనంద దీపావళి తాలూకు సంతోషపు చిచ్చుబుడ్డి ఒక్కసారి 'బుస్సు' మన్నది. తనవంక ఎవరైనా చూస్తున్నారేమోనని చుట్టూ చూశాడు. బజారుకు అటుప్రక్క మూసివున్న మెడికల్ షాపు అరుగుమీద మూడు అంకె వేసి కూర్చున్న నల్లకుక్క తలయెత్తి రాముకేసి చూసింది. ఇటుప్రక్క రంగయ్య బట్టల అంగడిలో నలుగురైదుగురు మనుషులున్నారుగా – వాళ్ళెవ్వరూ రాముకేసి చూడలేదు. కొంచెం దూరంగా తప్పెటబస్తాలు వేసుకొని దున్నపోతులబండి తోలుకొస్తున్న కాపు కొండయ్య కూడా రాముకు వీధిమధ్యలో అణా దొరకడాన్ని చూడలేదు. రాము ఆ అణాను లాగుజేబులో వేసుకొని–పరుగెత్తుకొంటూ ఇంటికొచ్చాడు.

రాము ఇల్లు ఊరుచివర డొంకలో వుంది. అది

ఒకరకంగా పాడుపడిన పెంకుటిల్లు. ఆ కుటుంబపుస్థితి ఆ ఇల్లు-అడిగి తెల్సుకోలేని దుస్థాంతరం ఇంటిచుట్టూ పడిపోయిన పాటినుట్టి గోడలు ఇంట్లోవాళ్ళ హోదాని చెప్పక చెప్తూవుంటాయి ఇంటిముందున్న రెండు కొబ్బరిచెట్లూ- పుట్టినప్పట్నుంచీ ఆ యింటి స్థితిగతుల్లోని హెచ్చుతగ్గుల్ని వీక్షిస్తూనే వున్నాయి. ఆ ఇంటికి ఇరుగూ పొరుగున పూరి కొంపలు.

రాము తల్లి వీధివాకిట్లోనే వున్నది - కొడుకుకోసం నిరీక్షిస్తూ.

అల్లంత దూరానవుండే 'అమ్మా!' అని కేక వేశాడు రాము ఆనందంపట్టలేక. నాన్నే మంచివాడు కాదమ్మా

వాడి కేకలోని సంతోషపు తీరుకు వాడిపోయిన ఆకుపగిదవున్న తల్లిముఖం మరీ సిరసపడింది. అది రాము గమనించ లేదు.

"అమ్మా! నాకు బజార్లో అణా దొరికింది. ఈ అణానుకూడా మట్టిముంతలో వేస్తాను. అమ్మా! దీనితో మట్టిముంతలో మొత్తం-ఆరురూపాయల పావలా వుంటుంది. మరి అమ్మా! మరి...ఇవాళ శంకరయ్య మాస్టారు స్కూల్లో నన్నెంతగా మెచ్చుకొన్నారని ముంతలో డబ్బు దాచికోవడం ఎంతో గొప్ప అంట. నన్ను చూసి మిగతా పిల్లల్ని నేర్చుకోమని చెప్పారు. ఈ డబ్బూ ఈ అలవాటూ పెద్దవాళ్ళు అయినాక ఎంతోపనికొస్తుందట" అంటూ రాము ఇంట్లోకి వెళ్లాడు వడిగా.

పలకా పుస్తకాలున్న సంచీని గోడమేకుకు తగిలించి

గబగబా దేవుని గదిలోకి వెళ్ళాడు మనస్సంతా సంతోష సాగరంవలెవున్న రాము.

రాము తల్లి హృదయం జారిపడ్డ గాజుపాత్రవలె గతుక్కుమన్నది;

దేవునిగదిలో - వెంకటేశ్వరస్వామివారి చిత్రపటం పైన గూట్లోని మట్టిముంతకేసి వెతికాడు రాము. ఆశ్చర్యం! అది కనబడలేదు. రాములోని ఉత్సాహం, ఉషారు, ఆనందం - ఒక్కసారి రబ్బరు బెలూన్‌లోని గాలిపోయినట్లు జారిపోయాయి. మెరుగుపెట్టిన బంగారు నగవలె నిగనిగలాడుతూన్న వాడి ముఖం అంతలోనే నల్లగా కావురేసి కొనిపోయింది.

"అమ్మా! నాముంత కనబళ్ళేదు! ఏమైంది?" అని గావుకేక పెట్టాడు రాము దేవునిగదిలోవుండి.

రాము తల్లికళ్ళలో నీళ్లు గిర్రున తిరిగాయి.

"నాముంత పోయింది. నాడబ్బు పోయిందమ్మా! అంటూ ఏడుస్తూ రాము దేవునిగది బయటకొచ్చాడు.

వాకిట మండిగం ప్రక్కన నిలబడ్డ తల్లి కొడుకు ముత్తని చెంపలపైన నీళ్ళ కారడాన్ని చూసింది. ఆమె కడుపులోని దుఃఖంకూడా పొంగి, ఉప్పొంగి నేత్రాలద్వారా వర్షించింది.

రాము బిగ్గరగా ఏడ్వసాగాడు.

తల్లి సముదాయించ నారంభించింది.

ఏడ్వకు బాబూ! ఏడ్వకు. ఇందాక నేను మంచి నీళ్ళకు బావిదగ్గరకు వెళితే - ఎవరో దొంగ ఇంట్లో జొర

బడి, నీ మట్టిముంత ఎత్తుకెళ్ళాడు. మళ్ళీ ఇంకో ముంత తెప్పించి - నీ ఆరురూపాయల మూడణాలూ నాన్నగారిచేత యిప్పించుతానులే. ఏడ్వకు మా బాబుగా! బంగారుకొండవుగా, రత్నాలరాశివిగదూ!"

తల్లి మాటల్ని రాము సరిగ్గా వినిపించుకోలేదు. రెండేళ్ళనుంచీ దాచుకున్న ముంత దానిలోని డబ్బూ పోయేటప్పటికి - ఆ బుల్లి హృదయం విపరీతంగా దెబ్బతిన్నది. పైపెచ్చు దేనివిషయమై అంతమంది విద్యార్థుల ఎదుట తను మాష్టరుచేత మెప్పును పొందాడో, తనకు తాను మురిసిపోయాడో, గర్వపడ్డాడో - అది అకస్మాత్తుగా అదృశ్యమైయేటప్పటికి ఆ పసిహృదయం దారుణమైన దుఃఖానికి గురికాక ఏముంది? గుక్కపట్టి ఏడ్వసాగాడు రాము.

కొడుకు ఏడుపును చూడలేక తల్లికూడా ఏడ్చింది.

తల్లి కళ్ళవెంట నీళ్ళుకారడాన్ని చూసి రాము హఠాత్తుగా ఏడుపును మానివేశాడు. తనకోసమేగదా! తన ముంతను దొంగలెత్తుకెళ్ళడం చేతనేగదా. తను ఏడ్వడం వల్లనేగదా - తల్లికూడ ఏడుస్తూన్నదని అనుకున్నాడు రాము.

"ఎందుకమ్మా! ఏడుస్తావు? ముంతపోతే పోయిందిలే. మళ్ళీ పోగుచేయనూ, నువ్వు ఏడ్వకమ్మా!" అన్నాడు రాము చెంపలపై జారిన కన్నీటిచారల్ని కుడిచేత్తో తుడుచుకుంటూ.

"బాబూ! అంటూ తల్లి ఉరకలెత్తే ఉద్వేగంతో రామును కౌగిలించుకుంది.

తల్లి పైటచెంగుతో రాము ఏడ్పుముఖాన్ని తుడుచు కున్నాడు. కాని కళ్ళునీళ్ళు ధారాపాతంగా వర్షిస్తున్నాయి.

"మరి అమ్మా! దేవునిదగ్గర ముంతపెట్టాను కదా! దొంగవచ్చి, ఆ ముంతను తీసికెళుతూంటే దేవుడు చూస్తూ ఎలా వూరుకున్నాడమ్మా! మరి మా మాష్టారేమన్నా మొన్న పాపంచేసినవాళ్ళని దొంగతనము చేసినవాళ్ళనూ-దేవుడు శిక్షిస్తాడని క్లాసులో చెప్పాడు. ఎందుకు శిక్షించ లేదమ్మా ఆ దొంగని దేవుడు?" అన్నాడు రాము అమాయ కంగా తల్లితో.

"శిక్షిస్తాడు! శిక్షిస్తాడు! కాని కొంచెం ఆలస్యంగా" అన్నది తల్లి గద్గదికస్వరంతో.

"ఆలస్యంగా శిక్షిస్తే ఏంలాభమమ్మా! తీరా డబ్బు పోయినతర్వాత! మరి దొంగను పోలీసులు పట్టుకోరూ! నా డబ్బు నాకు యిప్పించరూ! అన్నాడు రాము ఏడ్పును దిగ మింగుకుంటూ.

"పట్టుకుంటారు. కాని వాళ్ళకి దొంగ చిక్కాలిగా"

"ఎందుకు చిక్కడు? దేశంలో యింతమంది పోలీసు లుండగా! అసలు నువ్వు పోలీసులతో చెప్పావా! లేకపోతే వుండు. నేను పోలీసుస్టేషన్‌కు వెళ్ళి చెప్పివస్తాను" అన్నాడు రాము ఉద్రేకంతో.

"వద్దులే బాబూ! నువ్వు చిన్నవాడివి ఆనక నాన్న గారు వచ్చాక చెబుతాన్లే."

"ఆనక నాన్న యింటికి వస్తారా ... నా నామాట వింటారా! నాన్న మంచివాడు ... నాకు

ఎప్పుడేనా ఒక్క కానీ యిచ్చాడా! ఎప్పుడూ యింట్లో వుండడు. ఎక్కడెక్కడో తిరిగి ఏ అర్థరాత్రో ఇంటికి వస్తూ వుంటాడు. అదో రకంగా మాట్లాడతాడు. ఎప్పుడూ ఏదో వాసనకొడుతూ వుంటుంది. నన్ను తిడతాడు కొడతాడు కూడ. నాన్న అంటే అలా ఎవరైనా వుంటారా? నాన్న మంచివాడు కాదమ్మా!" అన్నాడు రాము బుంగమూతి పెట్టి.

"బాబూ!" అంటూ తల్లి భావురుమన్నది. రామును కావిలించుకొని.

రాము విస్మయంతో తల్లికేసి చూసాడు

"ఏడ్వకమ్మా! ఏడ్వకు, నాన్నని ఏమీ అననులే" అన్నాడు రాము తల్లి కన్నీరు తుడుస్తూ.

ఆ రోజు రాము భోజనం చేయలేదు. తల్లి బలవంతాన అన్నంపెడితే నాలుగు మెతుకులు కొరికాడుకాని, రోజూ తినేట్టు తినలేదు. వాడికేమీ తోచటంలేదు. ఆ దిగులే క్షణ క్షణానికీ కడుపులో తోడుతున్నది. ఆ మొత్తం ఎట్లా దొరుకు తుంది? అంత డబ్బును తనెలా కూడబెట్టగలడు?... శంక రయ్య మాష్టారుకు ముఖమెలా చూపెట్టడం? తను అబద్ధ మాడినాడని అందరూ అనుకోరూ! ఎలా? ఏంచేయాలి? — ఆ విచారంతో రాము సాయంకాలంవరకూ ఇంటిలోనే కాలుగాలిన పిల్లివలె తిరిగాడు. మధ్యాహ్నం బడికికూడా వెళ్ళలేదు.

"నాన్న ఇంకా రాలేదేం అమ్మా? ఎప్పు డొస్తాడు?" అని అడిగాడు రాము తల్లిని.

"వస్తారు బాబు! సాయంకాలం లోపుగానే వస్తారు" అన్నది తల్లి సముదాయించుతూన్న ధోరణిలో.

"ఏమో! నాకు నమ్మకంలేదు. రోజు రానిది ఇవాళ వస్తాడేమిటి?" అన్నాడు రాము కొంచెం కోపాన్ని నటిస్తూ.

"లేదు బాబూ! ఇవాళ తప్పకుండా పెందలకడనే వస్తారు" అన్నది తల్లి గట్టిగా.

సాయంకాలం దిగులుగా వాలింది. ఇంటిముందు కొబ్బరిచెట్ల నీడ వీధి దాటిపోయింది. రాములో అశాంతి క్షణక్షణానికీ పెరిగిపోతూన్నది బోనులో పెట్టబడిన జంతువు పిల్లవలె అటూ ఇటూ తిరుగసాగాడు. "అమ్మా! నాన్న ఇంకా రాడు. ఆలస్యమైతే దొంగ పోలీసులుకూడా దిక్కడు. నేను వెళ్ళి నాన్న ఎక్కడున్నా పిల్చుకొనివస్తాను" అంటూ బయల్దేరాడు రాము.

"వద్దు బాబూ! నువ్వెళ్ళవద్దు ఆయన ఎక్కడుంటాడో నీకు తెలియదు. నీకు కనిపించరు" అంటూ తల్లి ఎంత మొత్తుకున్నా రాము వినిపించుకోకుండా బజారుకు వెళ్ళాడు తండ్రినివెతికేందుకు.

తల్లి వీధి వాకిటిలో కొడుకు వెళ్ళినకేసి చూస్తూ చాలసేపు నిలబడింది. ఆమెలో విపరీతమైన ఆదుర్దా కనిపిస్తోంది. పైపెచ్చు మనస్సులో తీవ్రమైన బాధనికూడా పొందుతున్నది. తను అబ్బాయిముందు అబద్ధమాడింది. అలా అబద్ధం ఆడటంలో తను కేవలం స్వార్థాన్నే దృష్టిలో పెట్టుకోలేదు! ఎంతోమారు ఆలోచించే అబద్ధంతో అమా

యసుడైన రాము బాధని ఉపశమింపజేయాలని అనుకున్నది. ఆ ముంతకు వాస్తవంగా దొంగలెవ్వరూ యెత్తుకెళ్ళలేదు. అది తన భర్తపనే! ఆయనగారే ఆ ముంత పగలగొట్టి అందులోని డబ్బులు తీసికెళ్ళారు ప్రొద్దున తనని డబ్బు లడిగారు. తనదగ్గరే మున్నాయి. రెండు రూపాయలు కట్టెలు తెప్పించుకోవటానికి దాస్తే - నిన్ననే ఆయన తన పెట్టెవెతికి తీసికెళ్ళాడు. రోజూ తనెక్కడనుంచి డబ్బులు సంపాదిస్తున్నది. గేదెపాడిమీద వచ్చే ఆదాయమూ, విస్తళ్ళుకుట్టి, పిడకలు అమ్మిన సంపాదనా-ఇల్లు గడపటానికే అంతంత మాత్రంగా వుంటే, ఆయనగారి త్రాగుడుకూ, జూదానికీ, వ్యభిచారానికీ - రోజూ తనెక్కడి డబ్బు తెస్తుంది? ఇంటికి యజమానీ, కుటుంబాన్ని గుట్టుచక్కగా పోషించాల్సిన బాధ్యతగల వ్యక్తి, సంఘంలో పరువు మర్యాదలతో నిండుగా జీవించాల్సిన ఆయనే ఇలా అవినీతితో, అప్రతిష్టలతో, అక్రమంగా ప్రవర్తిస్తూ, చిల్లికాని సంపాదన లేకపోగా, ఉన్న ఆస్తినంతా పాడుజేస్తుంటే - సంసారమెట్లా చక్కబడుతుంది? ఆయనలో పరివర్తన ఎప్పుడు కలిగేట్టు?... తండ్రికీ కొడుక్కీ యెంత భేదం! ఇద్దరి మనస్తత్వాల్లో ఎంత తారతమ్యం? పసివాడైనా రాము ఎంతటి గుణవంతుడు! డబ్బుమీద తండ్రికెంత నిర్లక్ష్యమున్నదో - వాడికంతకంటే రెట్టింపు శ్రద్ధా, జాగ్రత్తా ఉన్నవి. 'ఆ ముంతలోని డబ్బులు మీ నాన్న తీసుకున్నాడు' అని తను నిజంచెపితే - రాము మరింతగా బాధపడతాడు. పైపెచ్చు వాడికి తండ్రిమీద ద్వేషం అధిక మవుతుంది, ఇప్పటికే 'నాన్న మంచివాడు

మంచివాడు కాదమ్మా !

...న్నాడు తను నిజాన్ని దాచడమే సబ
వయస్సులోనే కొడుక్కి తండ్రిమీద దురభి
...టుకొనిపోతే - యెదిగినాక ఇద్దరిమధ్యా పచ్చ
...మండుతుంది... కాని తనకెందుకో ఈ సంసారం
దేమోనన్న భయం రోజు రోజుకీ ఎక్కువ అవుతు
రాము బుద్ధిమంతుడు చదువుమీద వాడికి అపేక్ష
...గా వున్నది తండ్రేమో అట్లా తిరుగుతూ ఇంటి స్థితి
...ల్ని పట్టించుకోవటంలేదు. ఈ పాడుపడ్డ పెంకుటికొంప
...ట్లూ పిచ్చిమొక్కల్లాగేనే అప్పులు పెరిగిపోతున్నాయి.
తను రామును చదివించలేదేమో! వాడి అభివృద్ధికి తను పాటుపడలేదేమో! వాడి భవిష్యత్తులోని వెలుగును తను చూడలేదేమో... అలా ఆలోచిస్తూ రాము తల్లి వీధి వాకిటిలోనే ఉంది.

కాంతిని పోగొట్టుకున్న సాయంత్రం కన్నుమూయటానికి సిద్ధంగా ఉంది.

అల్లంత దూరంలో పరుగెత్తుకుంటూ వస్తూన్న రామును చూడగానే-ఆమె హృదయం చెట్టున మిగిలిన ఆఖరాకు పెనుగాలికి అల్లల్లాడినట్టుగా అల్లల్లాడింది.

రొప్పుతూ, రోజుతూ వచ్చిన రాము ఏడుస్తూ, "అమ్మా! నాన్నని పోలీసులు పట్టుకెళుతున్నారు" అన్నాడు.

రాము తల్లి నిశ్చేష్టురాలై నిలబడింది.

నాన్న మంచివాడు కాద

"అమ్మా! నాన్నని పోలీసు
తున్నారమ్మా!... నాన్న దొంగతనం చేశా
నాన్న దొంగా!" అన్నాడు రాము వెక్కి వెక్కి

"దుబాబు!" అంటూ తల్లి కొడుకును
తీసికొని పైటచెంగుతో కన్నీరు తుడుచుకుంది.

ప్రక్కయింటి వీరయ్య వచ్చాడు అప్పుడే
నుంచి. ఆయనే అడక్కముందే అసలు విషయం చె

"సారాత్రాగి, డబ్బులుపెట్టి గుళ్లో పేకాట ఆ
న్నందుకు పోలీసులు పట్టుకెళుతున్నారు."

వినిపించనట్టుగా విన్నది, రాముతల్లి ఆమాటల్ని.

"నాన్న మంచివాడు కాదమ్మా!" అన్నాడు రాము చొక్కాతో కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.







## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA123B122 |
| పుస్తకం పేరు | బ్రతుకనేర్చిన వ్యక్తి |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 119 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Thasin |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |